తీసి పారవేశారు. శ్రీనాగప్ప ప్రశ్నలను రెండింటిని, శ్రీకన్నన్ ప్రశ్నను ఒకదానిని ఆయన ఒరాక చారు. శ్రీనాగప్ప రెండో ప్రశ్నకు రాజాజీ సమాధానం చెప్పడానికి లేస్తూవున్నా శ్రీసాంబమూర్తిగా అడ్డుతగిలారు. శ్రీసాంబమూర్తిగారిలో ఈమార్పు రావడానికి ఏమిటి కారణం? ప్రజామిత్ర చెప్పి ఆయనకు ఫెడరల్ ఎజంబ్లీ స్పీకర్‌షిప్ మీద మోజుకుదిరిందా? దానిమీద కాంతపెట్టుకుని శ్రీసాం మూర్తిగారు కాంగ్రెస్‌లో అద్వితీయమైన పలుకుబడిగల రాజాజీని మంచిమాట చేసుకోవడంకోస సర్దార్ పటేల్ సదభిప్రాయాన్ని పొందడంకోసం ఇట్లా చేస్తూవున్నారా? మహర్షి ఆంధ్రజాతికి ఇంత ద్రోహం చేయ తలపెడతాడా?

౯. అక్టోబర్ ఆంధ్ర రాజకీయ మహాసభ పుట్టకుండానే చచ్చిపోతుందా?:—

కాకినాడలో ఉపన్యసిస్తూ ఆనడుమ శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఇండియా కార్యద ఆంధ్రరాష్ట్రాందోళన చప్పపడిందని అనుకుంటున్నాడనీ ఆభావం తొలగించడానికి ఆగష్టులో గుంటూరు ఆంధ్రమహాసభను, అక్టోబరులో చెన్నపురిలో ఆంధ్రరాజకీయ మహాసభను జరుపుతామనీ సెలవిచ్చా గుంటూరుసభ వాయిదాలమీద వాయిదాలుపడి ఎట్టకేలకు జరగడం స్థిరమైంది. కాని ఇంతలో అధ్యక్ష సమస్య వచ్చింది. లోగడ ఎన్నుకోబడిన అధ్యక్షులు శ్రీమోచర్ల గుండం విశ్వేశ్వరయ్యగారు రాజ మన్నారు. ఆపిమ్మట పిఠాపురము మహారాజులవారు అధ్యక్షులన్నారు. వారున్నూ వద్దన్నారు. ఆఖరికి అయ్యంగారిని అధ్యక్షస్థానానికి ఎక్కించారు. సభ ఎట్లో అయిందనిపిస్తారు. కాని అక్టోబరులో చెన్నపురి జరపడానికి ఉద్దేశింపబడ్డ ఆంధ్రరాజకీయమహాసభ ఈమాత్రానికికూడా నోచిపుట్టనట్లు కనిపిస్తూవుం అసలు అక్టోబరులో ఇక్కడ ఆసభే జరిగేటట్లులేదు. సభలేనా చేయలేని మనం రాష్ట్రంసంపాదించు గలుగుతామా? ఇంతకీ ఈసభను పుట్టకుండానే చంపివేసిన ఆపుణ్యాత్ము డెవడో?

౯. ఆంధ్రులు ఇల్లావుండగా అరవలు అన్నీ చక్కబెట్టుకుంటున్నారు:—

సభలుచేసుకునేపాటి సత్తాలేని చవటలమై మనంవుంటూవుండగా అరవలు అన్నీ చక్కబెట్టుకు న్నారు. నిరుటి అక్టోబరు ఆంధ్రమహాసభలో మదరాసు మనరాజధాని కావాలని ఒక తీర్మానప వేశాము. అంతే. ఆపిమ్మట మనం ఆవిషయమై ఏమీ ప్రయత్నంచేయలేదు. కాని అరవలు మ వారిదని నిరూపించుకోవడానికి మదరాసు త్రిశతాబ్ది ఉత్సవాన్ని లేవనెత్తారు. కాంగ్రెస్‌పెద్దలు వ వారా ప్రయత్నాన్ని మానలేదు. ఆకమిటీనుంచి పైకి రాజీనామా యిచ్చినా శ్రీవార్కి చాటున మా చానికి చేదోడువాదోడు కావడం మానలేదు. ఆఖరికి ఒక పెద్దచారిత్రకసంపుటాన్ని, మదరాసు చ గ్రంథాన్ని తయారుచేశారు. ఒక గొప్పప్రదర్శనాన్ని ఏర్పాటుచేశారు. ఆప్రదర్శనంలో సాధ్యమైనంత తెనుగును తెరమరుగున వుంచడానికి ప్రయత్నించారు. ఇన్నివిధాల వారు వారి కార్యశౌర్యాన్ని ప్రదర్శి వున్నారు. మనమో? ఏమి చెప్పడానికీ సిగ్గువేస్తూవుంది.—

౯. శ్రీవార్కీ పండితుడు తూలనాడినా ఆంధ్రులుపడివుండవలసిందే:—

జూలై 27–వ తేదీని నంద్యాలలో శ్రీవార్కీ అచ్చటి కాంగ్రెస్‌పెద్దల్ని తృణీకరించడం,

కార్యక్రమపత్రాన్ని చింపివేయడం జరిగించాడు. ఆవిషయం పత్రికలకు ఎక్కింది. ఒక సుప్రసిద్ధ ప్రతినిధి అందునుగురించి ఆమంత్రిని ప్రశ్నిస్తే గోడమీద పిల్లివాటంగా ఏదోచెప్పి తప్పించుకున్నాడు. మీద నంద్యాల కాంగ్రెస్ పెద్దలు అఖిలభారతకాంగ్రెస్ కార్యదర్శి కృపాళినీకి ఈసంగతి వివరంగా ంపారు. అతడు ఈసంగతి రాజాజీతో చెప్పకోమని వారికి ప్రత్యుత్తరంవ్రాశాడు. రాజాజీతో చెప్ప శ్రీవార్కీని ఈవిషయమై మాటవరసకేనా ఆయన మందలిస్తాడా ? ప్రజాస్వామికధర్మానికి విరు ుయిన్‌ను జయించిన ఫ్రాంకోను సమర్థించినందుకుగాని, కాంగ్రెస్ పెద్దలువద్దన్న మదరాసు త్రిశ వ సందర్భంలో ఒకనాటి సభకు అధ్యక్షతవహించినందుకుగాని శ్రీవార్కీని అతడు ఏమైనా మంద గాడా ! రాజాజీ దృష్టిలో పై రెండు విషయాలకంటె ఇది పెద్ద తప్పిదమౌతుందా ? కాబట్టి ఈ విష లో రాజాజీ ఏమీచేయడు. నంద్యాల కాంగ్రెస్ పెద్దల అవమానానికి నిష్కృతిలేదు. శ్రీరాజన్‌మంత్రి ఖపట్టణం విద్యార్థుల్ని పశువులంటే పడివున్న ఆంధ్రులు శ్రీవార్కీ నంద్యాల కాంగ్రెస్ పెద్దల్ని తృణీ స్తేమాత్రం పడివుండలేరా ?

## విశ్వభారతిలో చదువుకొన్నా విశేషం ఏమీ కనిపించదు :—

శ్రీగోపాలరెడ్డిగారు వంగరాష్ట్రంలో విశ్వభారతిలో విద్యాభ్యాసంచేశారు. అయినా వారికి వంగ ష్ట్రంలో ప్రతి అంగుళంమేరలోనూ కనిపించే రాష్ట్రాభిమానం కలికమంతేనా అబ్బలేదు. కావునసే ికి ఆంధ్రాభిమానం ఆవగింజంతేనా లేకుండావుంది. ఆగష్టు 14–వ తేదీని లా కాలేజీలో ఆంధ్రవిద్యార్థు ఉపన్యసిస్తూ వారు మనం భారతీయులమనే సంగతి మరిచిపోకూడదన్నారు. మనం ముందు ఆంధ్రులం- ాత భారతీయులం అని చెప్పకపోతే మానిరి మనం ఆంధ్రులము, భారతీయులముకూడా అని చెప్పినా ండేది. వారు ఆమాత్రంకూడా చెప్పలేదు. ఎంతసేపూ వారు మనం భారతీయులమనే సంగతి మరిచిపో దని సెలవిచ్చారు. ఈవిశాలత్వంలో ఆంధ్రుల ప్రత్యేకత పోతూవున్నందుకు ఆయనకు చింతలేదు. శ్రీగో రెడ్డివంటి బాధ్యతగల ఆంధ్రనాయకులు ఇట్లావున్నారు కాబట్టే ఆంధ్రరాష్ట్రం ఎప్పటి కప్పుడే వెనక్కి ావుంది.

## బ్రిటీష్ ఇండియాలో అయింది ఇక నైజాములోనా ? :—

పాతిక సంవత్సరాలుగా ప్రయత్నించి బ్రిటీష్ ఇండియాలోని ఆంధ్రమండలాల్ని భాషాప్రయుక్త విభజింపబడే పనిలో కృతార్థత బడయలేక పోయిన శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఉట్టికి లేనమ్మ స్వర్గానికి ఎగిరిందన్నట్లు నైజామురాష్ట్రాన్ని భాషాప్రయుక్తంగా విభజించాలంటూ ఒకస్టేట్ ు జారీచేశారు. నైజాములో 69 లక్షల ఆంధ్రులూ, 35 లక్షల మహారాష్ట్రులూ, 15 లక్షల కన్న ా వున్నారు. కాబట్టి వారివారికి భాషాప్రయుక్తంగా ఒక్కొక్క రాష్ట్రం నిర్మించాలంటున్నారు. ఇది ్యమాతేనా ? చింతలకు అజ్ఞవుండగా ఈబట్టిగుటకలతో ఏమి లాభం ? నైజాము ఆంధ్రులనుగురించి చించే దానికి పూర్వం పట్టాభిగారు బ్రిటీష్ ఆంధ్రులకురాష్ట్రం సంపాదించిపెట్టడం ఉచితమై వుంటుంది. కుండా అది కోరడం భావ్యంకాదు.

నళినీవసంతలు యేకమైనారు. వసుంధరనవ్వుతూ ఆగదివిడిచిపోయి.

# పెళ్ళికిపూర్వం పరీక్ష

"స్నానమున నీప్రేమకు అర్హురాలైన ఆమెను నీకు సంధానంచేసి మరీ పోదామని వచ్చా" అన్నది వసంత.

రచయిత :

కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యం.ఇ.

౧

సాయంకాలం నాలుగున్నర అయింది, నళిని పుస్తక భాండాగారంనించి అప్పుడే యింటికివచ్చాడు. కోటూ గుడ్డాతీసి బలక్కొయ్యకు తగిలించి కుర్చీలో కూలబడి ఏదో ఆలోచిస్తూ కూచున్నాడు. అతనిదృష్టికి ఎదురుగావున్న బల్లమీది కేలండరు మాత్రం కనుపిస్తోంది.

అతని మనస్సంతా ఏదో ఊహాప్రపంచంలో విహారిస్తూవుంది. బాహ్య ప్రపంచం మరిచిపోయాడు. అతడట్లా నిశ్చేష్టుడైవున్నతరిని అతని నేత్రద్వయాన్ని వెనుకనుండి చల్లనిచేతులతో ఎవరో మూశారు.

కళ్లు మూసేసరికి వళ్లు జలదరించి త్రుళ్ళిపడ్డాడు నళిని. ఆవ్యక్తి ఎవరో అతనికి తెలిసిందికాదు. మనస్సు కుదట పరచుకుని చేతులతో ఆ నూతనవ్యక్తి చేతులను తడిమినాడు. ఆ పరిశోధనలో ఆ[illegible] వెలిశలనడుమనుండి ఎదురుగుండా వున్న నిలువుటద్దంలో ప్రతిబింబించుచున్న వసంత గోచరం అయింది.

తాను ఎవరికోసం తపిస్తున్నాడో ఆ సుందరమూర్తి ప్రత్యక్షమైనందుకు పరమానంద భరితుడైనాడు నళిని. మెల్లగా ఆమెచేతులను విడిపించుకుని తన భుజములమీద వేసుకొని కుర్చీలో వెనకు జారబడి ఆమె ముగ్ధమోహనవదనం చూచి "ప్రాణప్రియా" అన్నాడు.

"నళినీ! క్షమించు నీ ఆలోచనను పాడుచేసాననుకుంటా" అంది వసంత.

"ఏమీ పాడుచేయలేదు, వసంతా! నాకు యింతకన్నా రాచకార్యమేముంది? ఈ సంఘటన పరమసంతోషమైనది నా జీవితానికి. నిలుచునేవున్నావు, కూచో."

వెంటనే వసంత చంగున ముందుకి వచ్చి బల్లమీద ఎగిరికూచుంది, కాలుమీద కాలువేసుకొని ఠీవిగా. నళిని చూపులతో చూపులుకలిపి 'ఏం నళినీ! ఆలా దిగులుపడివున్నావు? కారణం ఏమిటి? నేను వినతగ్గదైతే చెబుదూ' అంది అతిమధురంగా, జాలిగా.

"వసంతా! నీవు వినకూడంది ఏముంది? నిజంగా నామీద సర్వాధికారం నీకుంది. ఎంచేతనంటే, ఈతీవ్ర ఆలోచన అంతా నిన్నుగురించే గనుక."

'నన్నుగురించి చింత! నాతో నీకేం పని? నాకు చాలా ఆశ్చర్యంగావుందే.'

'ఏమినా[illegible]
దుతున్నావు[illegible]
తా!' అ[illegible]
రెండుచేత
వుగా త
పట్టుకుని[illegible] న[illegible]
ప్పుడు పెళ్ళి
కుంటావో
నాబాధఅంతా
పోతుంది. మ[illegible]
తి కలుగుతుంది
న్నాడు.

'ఓహో! యింకా నీవు ఆపాత
ణమే తలపోస్తున్నావా? నేను అ
చెప్పేశానే సమాధానం నీ ప్రార్థన

'వసంతా! నేటికీ నిన్ను వేడు
న్నా నీ పాతఅభిప్రాయమును
కొని నీకరుణాదృష్టిని, ప్రేమ
హాన్ని నామీద ప్రసరింపచేయ
తత్వం నాకేమీ అర్థంకావడ
అంతా అగోచరంగా వుంది. [illegible]
న్నావా, వసంతా! చంద్రబింబం
నీముఖం ఒకసారిచూపించి తళ
నీవుతిరిగిపోయిన వెనుక నా హృ
దవ వర్ణనాతీతంగా వుంటుంది.
పూర్వం ఎప్పుడెప్పుడు కలసుకు
అప్పుడు నాకేసి నీవు చూచే
పులు, ముసిముసినవ్వులు అ[illegible]
తెచ్చుకుని కుమలిపోతుంటాను.
రాత్రిలో చుక్కల వెలుగులా[illegible]
కైనా నీ అభిప్రాయం మార్చుకు
నన్ను పెండ్లి ఆడతానంటావనే

## పన్నెండు ఎకరాల ప్రదేశంలో ఒకనాడు పందొమ్మిదిలక్షలనాణాలపంట

# రూపాయిలు ఎక్కడచేస్తారు?

కలకత్తా టంకసాల కథ

పన్నెండు ఎకరాల ప్రదేశం— తొమ్మిదివందల మంది పనివాళ్లు—రోజుకు ఐదులక్షలనాణాల్ని తయారుచేసే ఏర్పాట్లు—దొంగతనానికి ఏమీ అవకాశం లేదు.

1924 కు దరిమిలా రూపాయిలు- 1920 కి దరిమిలా పలకల పావులాలు పోయలేదు.



మీ వద్ద 1925-వ సంవత్సరపు రూపాయి యేకాని, 1935-వ సంవత్సరపు రూపాయిలుకాని వున్నాయా?. వుంటే మీరు అంతగా సంతోషింపదగ్గ విషయం కాదు. ఏమంటారా? హిందూదేశంలోవున్న కలకత్తా టంకసాలకాని, బొంబాయి టంకసాలకాని 1924 కు దరిమిలాను కొత్తరూపాయిల్ని పోయలేదు. 1920 కు దరిమిలాను పలకల పావులా(నాలుగు అణాలు) కాసులు కూడా పోయలేదు.

ఎందుచేత? హిందూదేశపు టంకసాలల ఇటీవలి కార్యకలాపాన్ని కొంత తెలుసుకుంటే ఈ ప్రశ్నకు సమాధానం వస్తుంది.

సమీపంలో టంకసాలమందిరంవుంది. బ్రిటీష్ సామ్రాజ్యపు నగరాల్లో రెండవస్థానాన్ని ఆక్రమిస్తూవున్న పెద్దసంస్థలలో ఈటంకసాల ఒకటి. అయినా దానిసంగతి చాలా మందికి తెలియదు.

నూరుసంవత్సరాలకి పూర్వం అనగా 1824-వ సంవత్సరం మార్చి 31-వ తేదీని ఈమందిరానికి పునాదులు వేసారు. హుగ్లీనది ఒడ్డున ఒండ్రుమట్టితో కూడిన ప్రదేశానికి గట్టుపోసి నది వరదతో ఆస్థలం కాపుదల చేశారు.

స్థలం ఒండ్రుమట్టితో ఏర్పడబడ్డింది కాబట్టి అక్కడి పునాదులు లోతుగా తవ్వవలసి వచ్చింది. ఇరవై ఆరున్నర అడుగుల లోతునుంచి ఆమందిరానికి పునాదులు కట్టుకువచ్చారు. కావునే ఆమందిరానికి భూమికి ఉపరి భాగంలో కంటె లోపలిభాగంలోనే ఇటుక కట్టడం ఎక్కువగా వున్నదని ఇంజనీయర్లు అంటారు.




ఆరవజార్జి చక్రవర్తిపేర వచ్చే కొత్తఇండియానాణాలు.
(అసలుఆకారానికి కొద్దిగా పెంపొందింప బడ్డవి.)

గ్రీకు దేశపు రాజధానీనగరమైన యాథెన్సులోని మినర్వా (సరస్వతి) దేవాలయం పోలికను ఆమందిరంవుండేటట్టు ప్లానువేశారు. 1829–వ సంవత్సరం ఆగస్టు 1–వ తేదీని ఆమందిరనిర్మాణం పూర్తి అయింది.

ఆరోజుల్లో ఆటంకసాల రోజుకు మూడులక్షల నాణాలు చేయడానికి సమర్థమై వుండేది. కాని కాలక్రమాన్ని నాణాలకు డిమాండు చాలా ఎక్కువైంది. కాగా కొత్త మెషిన్‌లు ఏర్పాటుచేసి పోతపోయగలిగే నాణాల సంఖ్యను రెట్టించారు. పదిహేను ఏళ్ళకు దరిమిలాను అచ్చట కొత్త టంకసాల యంత్రాన్ని నెలకొల్పి దినానికి ఐదులక్షల నాణాల్ని తయారుచేయడానికి ఏర్పాటులు చేశారు.

కొత్తగా ఏర్పడ్డ టంకసాలను రాగినాణాలను తయారుచేయడానికి ప్రత్యేకించారు. పాతమందిరం బంగారు, వెండినాణాల పోతకు ప్రత్యేకించారు. దరిమిలా కొంతకాలానికి బంగారునాణాల పోత అసలే బర్తరఫు చేశారు.

ఈటంకసాలలో మిక్కిలి పాతకాలపు వస్తువులు కొన్నివున్నాయి. ఈస్టిండియాకంపెనీవారి ముద్రగల పెద్దపెద్ద తాళపు కప్పలు కొన్ని వున్నాయి. అవి సరిగ్గా ఎప్పటివో చెప్పడం కష్టం. కాని అవి ఎనభై సంవత్సరాల పూర్వపువి అని మాత్రం చెప్పవచ్చు.

అప్పటప్పటికి ఈటంకసాలకు కొత్తభాగాల్ని చేరుస్తూ వచ్చారు. కాగా నేడు ఆటంకసాల బ్రహ్మాండమైనదై వుంది. ఆటంకసాల ఆవరణ పన్నెండు యకరాల ప్రదేశం. దానిలో పనిచేసేవారి సంఖ్య తొమ్మిదివందలమంది.

ఆటంకసాల అన్నివేళలందునూ పనితో పిక్కటిల్లివుంటుంది. ఏడాదికి అది తయారుచేసే నాణాల సంఖ్య బ్రహ్మాండమైనదై వుంటుంది.

1918–వ సంవత్సరం డిశంబరు మాసంలో ఒకనాడు ఆటంకసాల పందొమ్మిది లక్షల నాణాల్ని–పూర్తిగా తయారైనవానిని– విడుదల చేసింది. ఇది ఆనాడేకాక ఈనాడు కూడా ప్రపంచంలోని టంకసాలల చరిత్రలో అతిలోకవిషయంగా ఎన్నుతున్నారు.

ఆటంకసాలలో కొత్తవి తయారుచేయడమే కాదు. దానిలోనికి నిరంతరమూ పాతగిల్లిన, అరిగిపోయిన నాణాలు బండ్లకొలది వచ్చిపడుతూవుంటాయి. వానిని అక్కడ తిరిగిపోసి కొత్తవిచేసి చెలామణీకి విడుదలచేస్తారు.

పైగా బంగారం, వెండి, రాగి లోహాలకడ్డీలు నిరంతరమూ వస్తూవుంటాయి. వాటిని చిత్రాకారం తైఫారుచేసి తీసుకుని, కన్నుండగా కంటిపాప తీసివేసే సమర్థతగల దొంగలకుకూడా స్వాధీనంకాని ఇనపబీరువాల్లో భద్రం చేస్తూ వుంటారు.

పోత అయినతరవాత ఒక్కొక్క నాణెం విషయంలోనూ చూబడే జాగ్రత్త విషయం పరికిస్తిమంటే అసలు నాణాన్ని పోతపోసే పని అంత విశేషమైందిగా వుండనే వుండదు.

వెండికడ్డీలు టంకసాలలోకివచ్చినప్పుడు వానిని బహు జాగ్రత్తగా పరీక్షిస్తారు. ఏమంటే ఆవెండి చాదీతనంలో తేడా పాళాలు వుండవచ్చు.

ఆతేడాపాళాలు కనిపెట్టి అందులో కలపవలసిన ఇతరలోహాల సంగతి తేలుస్తారు. దరిమిలాను ఆలోహాన్ని మూసలోవేస్తారు. ఒక్కొక్కమూస ఒక్కొక్కసారి ౬ వై రెండువందల రూపాయిలు యడానికి పనికివచ్చేటంతటి లోహాన్ని లోగొంటుంది.

ఆలోహం రూపాయికాసు దళసరిరేకుగా మూరేలోవుగా కనీసం ముప్ఫయి కరిగింపులేనా పొందుతుంది.

మూసల్లోకరిగిన లోహాన్ని ఆ ముదంపట్టించిన దిమ్మల్లో ... రు. ఒక్కొక్క నా ...
తూకంలో ...
పించినా ద...
జానికి ప...

ఆపిమ్మట నాణాలమీది తిరగ, ర్లబొమ్మలు వేస్తారు. అముద్ర ల క్రింద, మీదకూడా ఒకేసారి వేస్తారు. అంచుల్ని చిన్న మొనలు కూడా అవసరమైన వాటికి తేలు స్తారు.

ఆఖర్ని మళ్ళీ ఆ నాణాలు తూ స్తారు. బాగా పరీక్షచేస్తారు. అన్ని ధాలా తృప్తికరంగావుండే నాణా ల్నే చెలామణీకి వదులుతారు. పని నితనంలో, తూకంలో ఏమా తం అనుమానంవున్నా ఆనాణాల్ని రిగి కరిగింపుకి పంపేస్తారు.

ఒక్కొక్కనాణాన్ని తీవ్రంగా, శితంగా పరీక్షచేస్తారు. బారులు రివుండే పనివారిలో కొందరు ట్టూ అంచులు సరిగ్గావున్నా మో లేదో పరీక్షిస్తారు; మరికొం రు పైముద్ర సరిగ్గావుంకో లేదో స్తారు; వేరే కొందరు అడుగు ముద్ర సరిగ్గావుందో లేదో అనిపరి స్తారు.

ఈపరీక్షా ంరంపరలకు ఏమా త్రం తాళలేకపోయినా అనాణా లు తిరిగి కరిగింపుకుపోవలసిందే.

ఇన్నివిధాల స్తనశల్యపరీక్షలు చేసి ఆపరీక్షలకు తాళిన నాణాల్ని కింగ్ డిపార్టుమెంటుకు పంపించి అక్కడ వానిని దొంత తసంఖ్య రూ కాగితపు చు స్తారు.

ఆదొంతర పొట్లాల్ని దళసరి చెక్కల పెద్దపెట్టిలో పెడతారు. ఆ పెట్టెలకు దళసరి ఇనుపబద్దీలు ఆ పెట్టెలనిండా 'నాణాల దొంతర పొట్లాలుపేర్చి ఆ పెట్టెకు తాళం వేసి ఆటంకసాల స్టాంపుతో దాని మీద సీలువేస్తారు. ఆపిమ్మట పె ట్టెల్ని అవసరంవచ్చేదాకా దాచి పెడతారు.

ఈటంకసాలలో ఒక్క నాణాలు చేయడమేకాదు- ప్రభుత్వానికి కా వలసిన మెడల్సుకూడా చేస్తారు. మిలటరీ డిపార్టుమెంటుకు, సివిల్ డి పార్టుమెంటుకు మెడల్సు కావలసి వుంటాయి.

కెయిజర్-ఐ- హింద్ మెడలు వుందనుకోండి. అదిచేయడానికి మం చిపనివానితనం కావాలి. ఆపనివా నికి నేత్రేంద్రియశక్తి నిశితంగా వుం డడం అవసరం.

ఆ మెడల్ పూర్తిగా ఆటంక సాల్లోనే తయారు అవుతుంది. ఒక్కొక్కప్పుడు సామాన్యనేత్రా నికి అందనంతటిగీరుదానిమీదవుం డినా ఆ మెడల్ తిరస్కృతం కావల సిందే. ఆ మెడల్‌లో అనేకభాగా లు వున్నాయి. ఎన్నిభాగాలువున్నా చివరదానిమీద చిన్నగీటు కనిపిస్తే దానిని తిరస్కరించవలసిందే. తిరిగి మొదటినుంచీ దానిని చేయవల సిందే.

అయితే ఇంతకీ ఆటంకసాలలో దొంగతనం జరక్కుండా ఎట్లా క పుదలచేస్తారు? అందులో తొమ్మి వందలమంది పనిచేస్తూవుంటార కదా- వారు ఎవ్వరూ దొంగతన చేయకుండా వుండడానికి ఏమైన మెలుకువలు అవలంబించారా లేదా?

లేకేమి?

నాణాలు తయారు అవుతూవు డగా తరుచు తూస్తూవుంటారు అడుగడుక్కీ పరీక్షలు సాగుతు

వుంటాయి. లోహం ఏరూపంతో వుండుగాక ఒక డిపార్టుమెంటులోకి వచ్చేటప్పుడూ, దానిని వదలి పోయేటప్పుడూ అది తూకానికి గురి అవుతుంది.

ఆలోహం డిపార్టుమెంటులోకి వచ్చేటప్పుడు ఎంత తూకంవుందో దానిని వదలిపోయేటప్పుడుకూడా అంతతూకం వుండితీరాలి. ఏమాత్రం తేడావున్నా– తేడావుండడం చాలా అరుదుగా సంభవిస్తూ వుంటుంది– సరి అయిన ఉపపత్తి వెంటనే చూపాలి.

ఇక తూకంవేసే త్రాసులు అతి సున్నితంగా వుంటాయి. వేలకొలది వున్న నాణాల్లో ఒక్కనాణెం లోపించినా అసంగతిని ఆత్రాసులు చూపించివేస్తాయి.

ఒక డిపార్టుమెంటులో పనివాడు మరోడిపార్టుమెంటులోకి వెళ్ళతలుచుకుంటే అతని బట్టలు పూర్తిగా పరిశోధిస్తేకాని వెళ్ళనీయరు.

త్రాసులు జరిగిన దొంగతనాన్ని చూపలేకపోయినా —— ఇట్లా జరగడం అసంభవం — ఈబట్టల వెతికింపు దొంగతనానికి అవకాశం లేకుండా చేస్తుంది.

ఈమెలకువ ఒక్కటేకాదు. పనివాళ్లు లోపలికి ఏమీడబ్బుతీసుకురాకూడదు. వారు టంకసాలలో ప్రవేశించేలోపుగా వారివద్దవున్న పైకం బయటవుండే గుమాస్తావద్ద డిపాజిట్ చేయాలి. ఆడిపాజిట్ డబ్బుకు బదులుగా ఆగుమాస్తా ఒక లోహపుబిళ్ళ ఇస్తాడు. దానిమీద ఆడబ్బుమొత్తం ముద్రింపబడుతుంది. టంకసాలవీడి ఇంటికి పోయేటప్పుడు ఆలోహపు బిళ్ళను గుమాస్తాకు ఇస్తే అతను ఆబిళ్ళ మీద ముద్రితమైవున్న పైకాన్ని ఇచ్చి వేస్తాడు.

ఆటంకసాలలోనికి వచ్చే అరిగిపోయిన— మారని నాణాల్లో కొన్ని కవుంటర్ ఫీట్ (పూటా —— కరోడా——దొంగ) నాణాలు కూడావుంటాయి.

అరగిపోయిన– మారని నాణాలనుండి ఆపూటానాణాల్ని ఎంచి విడతీయడానికి ప్రత్యేకం ఒక్క డిపార్టుమెంటు. ఈడిపార్టుమెంటు వారికి కరోడానాణాల్ని ఎంచి విడతీయడం ఒక్కటే కాకుండా ఇండియా మొత్తంమీదవచ్చే దొంగనాణాల కేసుల్లో సాక్ష్యాలు ఇచ్చి పోలీసు వారికి సాయంచేస్తే పనికూడా వుంటుంది.

ఈమాదిరిగా ఆటంకసాల నిరతరమూ సాగిపోతూ వుంటుంది. విధంగా నూరేళ్లుగా ఆటంకసాల సాగిపోతూవుంది.

ఒక్కొక్కప్పుడు ఆటంకసాలకు తలమునకలుగా పని తటస్థపడుతూ వుంటుంది. నిదర్శనంగా ఒక సంగతి పేర్కొంటాను.

ఐరోపామహాసంగ్రామం రెండు సంవత్సరాలుసాగినతరువాత ప్రజలు కర్రెన్సీనోట్లకు బదులు వెండి రూపాయలకోసంతహతహలాడారు.

అప్పుడు ప్రభుత్వంవారు ఎన్నో

మిగతా ౪౪-వ పేజీలో.

## వైవాహికజీవితవిజయానికి సంభోగశక్తితో సంయమశక్తికూడా వుండాలి

# వైవాహిక ప్రణయం

[ఎం. డి. పరీక్షనిచ్చి పేరుమిగిలిన డాక్టరు అయి నోబిల్ బహుమానమందిన శ్రీ ఎలక్సిస్ కౌరెల్ మహాశయుడు వైవాహిక ప్రేమనుగురించి వ్రాసిన వ్యాసానికి ఇది తెనిగింపు. ఇందలి భావాలు మహనీయాలై వున్నాయి. విజ్ఞానదాయకమైవున్న ఈవ్యాసం అవశ్యంగా పఠింపతగింది. —సంపాదకుడు ]



ప్రేమ అనేది అద్భుతమైన మస్తవిషయం. అది అగోచరమైనది, నిరాకారమైనది. అగోచరము, నిరాకారము అయినద్ది అయినా అది కృవలె నిజమైనదై వుంది.

గాలిలోని పొగవలెనే అది కు దొరకదు. కాని అది మృత్యువుకంటె బలీయమైనది.

కామమోహంనుంచి అది పారాని, స్వార్థమెరుగని ప్రేమగా రావచ్చు. అట్టి ప్రేమగల గృహంలో దానిని కొత్తగావచ్చే ఆంతకుడుకూడా అత్యంతసులభంగా గుర్తింపగలడు.

అప్రేమను జాగ్రత్తగా పెంచుంటూవస్తే ముదిమి పైకొంటూచ్చినా, సంతానోత్పాదనశక్తి చినా అది దాని సౌందర్యపులంతో పెంపొందుతూనే

ప్రేమోత్పత్తి కాయకమూ, మానసికముకూడా. పురుషుని ముష్కమున్నా, స్త్రీ అండాశయమున్నా మానవుని రక్తప్రవాహంలోనికి విడుదలచేసే పదార్థాలు మానవుని మానసిక, కాయక కార్యకలాపాలమీద గొప్ప పలుకుబడిని కలిగివుంటాయి.

అవి మానవుని దేహాన్ని అంతా గాఢమైన సంభోగవాంఛతో ముంచెత్తుతాయి. అవి అస్వార్థమైన ప్రేమను, అపూర్వమైన అర్పణను కలిగిస్తాయి. అవి ప్రేమికుల ప్రపంచాన్ని నిత్యవసంతం యొక్క శాశ్వతానందంతో వెలిగిస్తాయి. అనగా మానవుని మనస్సు ఉదారమైన, ఉన్నతమైన భావాలతో ప్రేరితమైవుండడానికి అవసరమైన శారీరకప్రయోజనాల్ని అవి సరఫరాచేస్తాయి అన్నమాట.

తెలిసివున్నా, తెలియకపోయినా సంతానోత్పాదనవాంఛే ప్రేమకు మూలకందము. మానవుని లో ఏకత్వముంది, అనేకత్వముంది. అతడు సృష్టించవలసివుంది, ప్రేమించవలసివుంది. పైగా అతడు సర్వాంగాలతోనూ ప్రార్థించవలసివుంది.

నేటికాలంలో అత్యంత ప్రాచీన కాలంలోవలెనే యువకులు ప్రేమించడంలో తమకు సహజమైన సామర్థ్యంవుందనే ఆకర్షణీయమైన అపాయకరమైన భ్రాంతిలో న్నారు. ఫలితంగా ప్రేమ—ము ఖ్యంగా వైవాహికప్రేమ—తరచు నడుమలో తెగిపోతూవుంది.

వైవాహికప్రేమజీవనం [illegible] భమైన కార్యంకాదు. మన [illegible] దృష్టంచేత వైవాహికశాస్త్రం [illegible] రకాలంగా ప్రాథమికస్థితిలోనే వుం డిపోయింది. వైవాహికశాస్త్రం యొక్క అభివృద్ధి మానవుని సుఖా నికిన్నీ, నాగరికతయొక్క మనుగడ కున్నూ అత్యావసరమైంది.

వివాహంయొక్క సన్నిహిత ప్రయోజనం సంభోగవాంఛ [illegible] క్క సంతృప్తియున్నూ, గర్భధారణయున్నూ. సంభోగవాంఛ [illegible] మైన, తిర్కరింపరాని ప్రకృతివాం

ఫలలో ఒకటి ఐనది.

అది శృంగారవిలాసోద్రేకం కంటె అతిశయమైంది. కోరికకు అది జీవన్మూలము.

దానిని ఎల్లకాలానికి సరికొత్తగానూ, శక్తివంతంగానూ వుంచుకోవచ్చు. అవుంచుకోడానికి మానవుడు తన బుద్ధిబలాన్ని, భావనాబలాన్ని లెస్సగా ఉపయోగించుకోవాలి.

అనోన్యసహకారంతో కూడిన ప్రేమజీవనం వైవాహికస్థిరత్వానికి, సుఖానికి మూలకందం.

వైవాహికప్రేమ సృజనోద్యమము. అది హఠాత్తుగాకాని, సహజబుద్ధితో కాని ప్రాప్యంకాదు. శ్రద్ధలేని- ఉపేక్షతోకూడిన సంభోగము జ్ఞానం, గుణం లేకపోవడానికి గురుతు.

❧

గర్భధారణకృత్యంలో ప్రశాంతగంభీరమైన సౌందర్యముంది. అందులో అతిలోకపావిత్ర్యంకూడా వుంది. స్త్రీపురుషుల సంయోగాన్ని ప్రతిమతమూ ఆశీర్వదిస్తుంది.

కొందరు తల్లులు తమకూతుళ్ళ హృదయంలో కామవాంఛ యెడల నీచభావాన్ని కలిగించడంతో గొప్పనష్టాన్ని సంఘటింపచేస్తారు. కాని ఇది మంచిపద్ధతికాదు.

మనశాస్త్రీలు, విజ్ఞానము, సాంకేతికవిద్యలు అన్నీ తమ ఉపపత్తులను ఉపయోగించి దాంపత్యసంబంధాలు అన్యోన్యమైన ఆనం-

దానికి నిరంతరవాహినులుగా వు-
డేట్లు చేయాలి.

సంభోగాన్ని శాశ్వతమైన ఐక-
తగా చూర్చడమే వివాహసమస్య-
స్త్రీపురుషులు తమవద్ద కొరవ
వుండే అవతలివారి గుణాలవ-
ఆకర్షింపబడుతూ వుంటారు.

❧

పురుషునిలో పురుషత్వమూ
స్త్రీలో స్త్రీత్వము ఎంత ఎక్కు-
వగావుంటే వారి సంయోగం అం-
ఎక్కువ తీవ్రమై వుంటుంది. కా-
కామవాంఛ శరీరాన్ని మనస్సు-
చొరబారి వశపరచుకుంటుంది. స్త్రీ
పురుషులు ప్రత్యేకతకలవారు. వ-
రు అతి సన్నిహితంగా బంధితుల-
అయినా వారి ఇరువురినీ అగాధ-
ఒకటి వేరుచేస్తూవుంది.

పురుషత్వమునకు— స్త్రీత్వమ-
నకు శారీరక, మానసిక విభేదా-
వుండడంచేత స్త్రీపురుషుల శాశ్-
సంయోగం కష్టతరమవుతూవుం-

పురుషుడు చురుకుగా, నిక-
చ్చిగా, యుక్తిసహంగా వుం-
డు. స్త్రీ స్తబ్ధతగా, రసమయంగ
సహజజ్ఞానప్రేరితంగా వుంట-
స్త్రీయొక్క నరాలపద్ధతి, -
గుణగణాలు ఆమెను మాత్-
నికి ప్రేరేపిస్తాయి.

❧

విభిన్నప్రకృతులుగల - ఒక
ప్రకృతిలోని లోటును మరియొ-
ప్రకృతి భర్తీచేసే గుణంగ-
రువ్యక్తుల సంయోగమే వి-

దంపతులయొక్క ఈ విభిన్న ప్రకృతులే వారిసంయోగంయొక్క సామర్థ్యానికీ, వారి సంయోగంవలని కష్టానికి కారణాలు.

భార్యాభర్తలు కాయక, మానసిక విభేదాలచేత విభిన్నులై వుండడమే కాదు; ఈ విభేదాలు కామఋతువులో వారంవారానికి మారుతూవుంటాయి. కామఋతువు పురుషునిపట్లకంటె స్త్రీపట్ల స్పష్టతరమై వుంటుంది. నెలసరి ఋతువువున్నంతకాలమూ స్త్రీయొక్క చురుకుతనంలో, ధైర్యంలో, గుణంలో, కామవాంఛలో తరుచు మార్పులు సంఘటితాలు అవుతూ వుంటాయి. ఇట్టి మార్పులు పురుషునిపట్లకూడా కొంతవరకు వుంటాయి.

స్త్రీపురుషులకు అనేకవిధాలభావాలు భార్యాభర్తలు అన్యోన్యం తెలుసుకోవడానికి ఈవిషయజ్ఞానం ఉపయోగించుకొని దాంపత్యజీవితంలో తారసిల్లే అనేకవిషాదసంఘటనాలనివారు మాన్పుకోవాలి.



వివాహంలో విజయం సంపాదించాలంటే సంభోగశక్తితోబాటు సంయమశక్తికూడా వుండితీరాలి. అంటే ఏమన్నమాట? క్రమబద్ధమైన కామజీవనంలో గుణం, నీతి తోసివేయరానివని.

కొన్ని కాలాల్లో- రోగమువచ్చినప్పుడు, గర్భము ధరించినప్పుడు మాత్రమే కాక ఇంకా మరికొన్ని కాలాల్లోకూడా సంయమశక్తి అవలంబించవలసిన అక్కరవుంది.

వైవాహిక జీవనంలో కొంతకాలమే అగుగాక బ్రహ్మచర్యం అవలంబించడానికి దంపతులకు నైతికంగా మనోబలమూ, నరములను శమింపచేసుకునే దమమూ ఉండాలి. ప్రస్తుతం పలువురు వ్యక్తులకు అదివీరోచితకృత్యమే. అయివుంది.

వివాహానికిపూర్వం అస్ఖలితబ్రహ్మచర్యమే ఆదర్శప్రాయమైనది. బ్రహ్మచర్యవ్రతదీక్షితుడు కావడానికి ఆవ్యక్తి చిన్నప్పటినుంచీ నీతిబోధను అందవలసి వుంటుంది. ఆత్మసంయమశక్తికి అది అమోఘనిదర్శనం.

యౌవనంలో ఐచ్ఛికంగా సంభోగకృత్యాన్నుండి విరమించుకొని వుండడం- నీతిబలంచేతనూ, ఇతర శారీరకసాధనాలచేతనూ నిర్బంధబ్రహ్మచర్యం అవలంబించడం కంటె- జీవితాన్ని ఉత్పథానికి కొనిపోతుంది.



వ్యభిచారిణులను ఉపయోగించడం హానిప్రదమైంది. ఏమంటే డబ్బిచ్చి ప్రేమను కొనుక్కోవడం నిజమైన సంభోగకర్మయొక్క పావిత్ర్యాన్ని చెరచడమే. సంభోగంలో ప్రధానమైనవిషయం అన్యోన్యతకదా! వ్యభిచారిణులవద్ద ఆ అన్యోన్యత అపరూపపువస్తువు. వ్యభిచారసంభోగానికి బ్రహ్మానం

జసౌందర్యం ముఖ్యం.

నిజమైన ప్రేమకూడా భార్యాభర్తల్ని కొన్నికొన్నిరకాల సంభోగసంబంధమైన అపాయాలనుండి పరిరక్షింపక పోవచ్చును.

దాంపత్య జీవితారంభంలో సంభోగకృత్యంలో భార్యాభర్తలు అత్యాచారంగా ప్రవర్తిస్తే వారి శరీరాలు పూర్తిగా పెంపొందవు, వారి మనస్సులు పూర్ణంగా వికసింపవు.

దాంపత్యజీవితమధ్యంలో భార్యాభర్తలు సంభోగకృత్యంలో మితిమీరితే వారికి ముసలితనం శీఘ్రంగా పైబడుతుంది.

భర్త విషణ్ణహృదయుడై వున్నప్పుడుకాని, అలసిపోయి వున్నప్పుడుకాని కామవాంఛాప్రేరితురాలైన భార్య అతనిని సంభోగకృత్యానికి ప్రేరేపించకూడదు. అల్లే భర్తకూడా కామవాంఛా విముఖురాలై వున్న భార్యను సంభోగకృత్యానికి బలాత్కారంగా ఒప్పించి ఆమెను అలయచేసి విసిగించకూడదు.

స్వార్థపరత్వాన్నికాని, అజ్ఞానాన్నికాని ప్రేమ సహించదు. రోగవిషయంలోకూడా అది అట్టిదే. ఈరోజుల్లో యువతులు, యువకులు వివాహానికి పూర్వం నిష్కళంక బ్రహ్మచర్యంలో వుండివుండడం అసాధారణ విషయమైవుంది. కాబట్టి ప్రేమికులు వివాహానికి పూర్వం తమతో వివాహబంధమున బంధితులయ్యే వ్యక్తులు సెగ, సవాయి మొదలయిన రోగాలులేనివారుగా చూసుకోవాలి.

సంభోగసంబాధాల్ని గురించి ప్రత్యేకంగా ప్రకృతిన్యాయసూత్రం ఏమీలేదు. సంభోగకృత్యం తరుచుగా జరగడం – అనేకదినాలకి ఒకసారి జరగడం ఈవిషయంలో ఏమీ నిర్ధరించి చెప్పడానికి వీలులేదు. సంభోగవిషయంలో వస్తాదులు అనగా ఆకృత్యాన్ని తరుచుచేసేవారు కొందరు– సంభోగవిషయంలో బలహీనులు అనగా ఆకృత్యాన్ని అనేకదినాలకి ఒకసారి చేసేవారు కొందరు.

ఇతర జంతువుల్లో సంభోగం ఒక్క ఋతుకాలంలోనే జరుగుతుంది. మానవుల్లో దానికి కాలనియమంలేదు. అది ఎప్పుడైనా జరగవచ్చు. కాగా కామపురుషార్థనిర్వహణవిషయంలో మానవప్రకృతి సహజస్వభావం కాక బుద్ధి, ఆత్మసంయమం తీరుదిద్దేవిగా వుండాలి.

వివిధవ్యక్తుల శరీరస్థితులు వివిధాలుగా వుంటాయి. కాగా కామవిషయంలో నిర్ధరించి సూత్రాలు తయారుచేయడానికి వలనుపడదు. దంపతులు తమతమ శారీరక మానసిక పరిస్థితులను పరిపూర్ణంగా పర్యాలోచించుకోవాలి. ఈ ఆలోచన, ఈసంబంధమైన జ్ఞానము

[మిగతా ౪-వ పేజీలో.

## బాగావుండి ప్రజామోదాన్ని పొందని సినీమాలకు ఆయువు తక్కువ

# సినిమా : ప్రచారం

[సినీమాకళకు సంబంధించిన ఈ వ్యాసంలోని మొదటి భాగాన్ని గతమాసపు సంచికలో ప్రచురించి వున్నాము. ఈసంచికలో తరువాతి భాగము ప్రచురింప బడుతూవుంది. ఈ భాగంలో సినీమాకళకు ప్రకటన ప్రచారంయొక్క ఆవశ్యకత నిరూపింపబడింది—

—సంపాదకుడు.]

రచయిత:

## శ్రీ గిర్రాజు రామారావు

ప్రచారమునకు పద్ధతు లనేకములుంటాయి. పత్రికలలో వ్యాసాలువ్రాయుట, ప్రకటనలు ప్రకటించుట, సంభాషణలు వ్రాయుట, ఉపన్యాసాలు ప్రచురించుట, ప్రదర్శినశాలలో ప్రదర్శించుట మొదలగునవి ముఖ్యమైనవి. ఇందువలన డబ్బు తక్కువ – ఉపయోగ మెక్కువ అగును. ప్రకటనల భాష కఠినముగా నుండరాదు. ప్రతి ప్రకటనకు Headlines ఉండాలి. ప్రకటనలోని బొమ్మలనుగూర్చి చదువకుండానే అవి అర్థమైపోవాలి. వానిలోని వాక్యాలు చిన్నవిగా వున్నప్పటికిని భావమెక్కువ గలవియై వుండాలి. పత్రికలలో ప్రకటనల నిచ్చునప్పుడు ఆపత్రికయొక్క ప్రాముఖ్యత, ఆపత్రిక ఏతరగతికి చెందినదో ఆలోచించుకోవాలి. కొందరు ఏదో ఒక తరగతికి చెందిన సామాన్యపత్రికలో ప్రకటనల నిస్తారు. వానికి ఖర్చుపెట్టినడబ్బు దండగ తప్ప వేరుకాదు.

ఫొటోలు విడిగాతీసి ప్రచురిస్తారు. అవి చాలా ఆకర్షణీయముగా ఉంటాయి. వానిని స్టిల్ ఫొటోలు అంటారు. ఫిల్ములోనుండి మంచి భంగిమములు తీసి ప్రచురిస్తారు. దీనిని లేఅవుట్ అంటారు. ఇది చాలా చాకచక్యముతో నిర్వహింపవలసినపని. విదేశాలలో ప్రచారసంఘాలుంటాయి. ప్రచార పద్ధతులు వీరు నిర్ణయించుకొని పనికిదిగుతారు. ఈవిధమైన కట్టుదిట్టపు పనివలన చాలా లాభముంటుంది. వీరు సాధారణముగా ప్రపంచములోని అన్ని ప్రకటనలను ప్రోగుజేసికొని వానిపై మంచి పద్ధతులను కనిపెట్టుతూ ఉంటారు.

కొంతమంది ఫిల్ముకంపెనీపేరు, ఫిల్ము పేరును మాత్రమే ప్రచారము చేస్తారుకాని Display Adversisement పద్ధతి ఇంతకంటె మంచిది. Display Advertisement అనగా బొమ్మలతోసహా వ్రాయుట. రెంటిని సమన్వయించుకుంటూ వ్రాయటాన్ని Composition అంటారు. అది సరిగాలేకపోతే క్రమప్రకారములేని వ్యాసముమాదిరి ఉంటుంది. కొందరు భావచిత్రాలు వేస్తారు. దానిని చూచినవెంటనే ఫిల్ము చూడాలని బుద్ధిపుట్టుతుంది. సంభాషణను చదువరులే ఊహించుకుంటారు. ఈపద్ధతి విదేశాలలో బాగా జరుగుచున్నది.

Indirect Selling Advertisment అనేది ఒకపద్ధతి. ఒక వస్తువుద్వారా మరియొకవస్తువును ప్రచారముచేయుట దీనిపని. Prestige Advertisement అనేది మరిఒక పద్ధతి. ఈరకపు ప్రకటన అనగా కంపెనీయొక్క గౌరవమునే ప్రచారం చేయుట. 'ప్రభాత్, న్యూథియేటర్సువా' రీపద్ధతిని పట్టినారు. అందువలన కంపెనీపేరు వినినవెంటనే జనులు ఫిల్ము చూడటానికి పరిగెత్తు

తారు. ఆంధ్రదేశములో నిలకడగావున్న కంపెనీలేదు కనుక ఈ మాదిరి ప్రచారము ఇంతవరకు సాగలేదు.

కొందరు కుతూహలము పుట్టించుటకు విచిత్రముగా ప్రచారముచేస్తారు. కంగోరా ఇందులోని మూడక్షరాలు వారానికి ఒక్కొక్క అక్షరముచొప్పున మూడు వారాలలో పూర్తిచేస్తారు. ఇది చాలామందిని ఆకర్షించుతుంది. మరికొందరు KNKTR అని వ్రాసి కనకతార అని అర్థముచేసికోమంటారు. మరికొందరు తమఫిల్ముద్వారా ఇతరకంపెనీయొక్క గుణాగుణాలు వర్ణిస్తారు. ఇది మంచి పద్ధతికాదు.

American Association of Advertising Agency వారు ఫిల్ము అనుకున్న తేదీకి వస్తుందనే ధైర్యముంటేనే ప్రచారము ప్రారంభిస్తారు. ఒకవేళ ముందుగా ప్రారంభించిన తరువాత ఫిల్ముసమయానికి రాకపోతే నష్టాలు చాలా ఉన్నాయి. చూడబోయేవారు నిరుత్సాహపడతారు. ఈలోపుగా ఆమాదిరి ఇంకోఫిల్ము వచ్చి దిగిందంటే, తరువాతవచ్చే ఫిల్ముకు నష్టము. అదేకాకుండా కంపెనీమీద ప్రజలకు నమ్మకముకూడ కొద్దిగా తప్పిపోతుంది.

ప్రచారవిభాగాధ్యక్షుడు తన వస్తువునుగురించి, తనదేశములోని మనుష్యులగురించి బాగా తెలిసినవాడై ఉంటాడు. Psychology in Advertisement అనేపుస్తకములో 'It is the foundation of the appeal to awaken or arouse the dormant desire in the mind of the behaviour machanisms which will lead to the satisfaction of the desire' అనిఉన్నది.

సాధారణముగా నేటి జనానికి ఈక్రింది విషయాలలో సరదా ఉంటుంది కాబట్టి ఆవిషయాలమీదనే ప్రకటనలు తయారుచేసి జనులను ఆకర్షిస్తారు. 1. రాజకీయము, 2. ఆహారవిహారాదులు, (3) భోగము-ప్రేమ, (4) సంసారకష్టాలు, (5) ఆరోగ్యము, (6) సుఖము- స్వాతంత్ర్యము, (7) ఆమోదప్రమోదాలు, (8) సౌందర్యము (శారీరకము), (9) సంతానోత్పత్తి. ఈవిషయాలను గురించి ప్రచారవిభాగమువారి కెంత కల్పనాశక్తి, భాషాజ్ఞానము, సూక్ష్మబుద్ధి, ప్రపంచజ్ఞానము, Market Study ఉంటే అంతమంచిది. వీరు Campaign book అని ఒక పుస్తకాన్ని తయారుచేసుకుంటారు. దానిలో ఎప్పటికప్పుడు క్రొత్త పద్ధతులు వ్రాసుకుంటూ ఉంటారు. ఇది మనదేశములో జరుగుతున్నదో లేదో తెలియదు.

పత్రికలలో ప్రకటనలే కాకుండా పోస్టర్లు, Heralds, Slides, Hand Bills, Books, Blocks and Conversations, Studio news మొదలగునవికూడ ప్రచారానికి ఉపయోగిస్తారు. ఈవిషయములో వందేమాతరం, కృష్ణలీలలు ప్రచారము చెప్పుకోదగినదే. న్యూథియేటర్సు అధికారి బి.ఎన్. సర్కారు ప్రచారములో చాలా నిపుణుడు. ఇతను ప్రచారము ఖర్చు తగ్గిస్తూనే పని ఎక్కువచేయగలడు. విదేశాలలో మోటార్లలో సినీమాలు పెట్టి ప్రచారము చేస్తారు. ఈమాదిరివి అమెరికాలో 465 ట్రక్కులున్నాయి. బ్రిటన్ లో 11 ట్రక్కులున్నాయి. ఇవి రాజకీయాలను ప్రచారము చేస్తాయి. Conservative Film Association వారు ఈ ప్రచారాన్ని చక్కగా కొనసాగిస్తారు. జర్మనీలో Ministry of Propaganda అని ఒక సంఘమున్నది. 1937లో వీరు చేసిన గొప్పపనికి బహుమానము కూడ పడసినారు.

ప్రచారానికి కంపెనీ గౌరవానికి కొన్ని కంపెనీ గుర్తులుంటాయి. (Trade marks) సినీమా చూడబోయేవానికి ముందుగా కనుపించేది ఇదే. వ్యాపారమహత్వ మెక్కువచేసికుంటానికి వీనిని పెట్టుకుంటారు. ట్రేడ్ మార్కులు ఆయావస్తువులకు చిహ్నాలన్నమాట. అవి రాజ్యాలకు సంస్థలకుకూడ ఉంటాయి. వీనిని ఎంబ్లెమ్‌లు అంటారు. వ్యాపారానికి ట్రేడుమార్కులంటారు.

ట్రేడ్ మార్కులు పెట్టుకోవడంలో కొంత అర్థముంటుంది. కొ

న్నిటి కర్థమేఉండదు. మన దేశము ఫిల్ముకంపెనీలన్నిటికి ఈమార్కులున్నాయి. ఏవోకొన్ని ముఖ్యమైనవానిని గురించి వ్రాస్తే బాగానే ఉంటుందనుకుంటాను.

మన దేశములో ప్రభాత్ కంపెనీ చాలా పెద్దది. వీరు కళకొరకు, అభినయముకొరకు, సంఘసేవకు పనిచేస్తూఉంటారు. వారి ట్రేడ్ మార్కు కళాపూర్ణమయినది. దానిని చూచినవెంటనే ప్రభాత్ కంపెనీ జ్ఞాపకమువచ్చును.

ధనుసాకారమున వంగి అప్సరస భేరీనత్తి స్వర్గసంగీతమును వినుపించి జనులను వశముచేసికొనును. దానివెనుక ప్రకాశము వచ్చును. అదియే ప్రభాతము. దీనిలో జీవమున్నది. జ్యోతియున్నది.

న్యూథియేటర్సుకూడ మన దేశములో పెద్దకంపెనీ అని చెప్పవచ్చును. దీని ట్రేడ్మార్కు ఏనుగుతల- లక్ష్మీస్వరూపము కావచ్చును. దీనిమీద 'జీవితాంజ్యోతి రేతుఛాయం' అని వ్రాసియుండును. మొత్తముమీద కంపెనీవారి ఫిల్ములకు మార్కునకు సంబంధమేమియో తెలియదు.

ఇంపీరియల్ వారు మొదట కిరీటాన్ని పెట్టుకొని తరువాత పెద్దపులిని పెట్టుకున్నారు కాని ఇది నిర్జీవమైనది. మెట్రోగోల్డ్విన్ వారిది సింహము. ఒక్కఅరవు అరచి ముందుకుదూకుతుంది. చాలా వైభవంగా ఉంటుంది చూచే వారికి.

రణజిత్ కంపెనీవారు వీరరసపోషకులు. వీరియుద్దేశ్యమున కనుకూలముగానే గుఱ్ఱముమీద స్వారి చేయుచున్న రసపుత్రవీరుని మార్కుగా పెట్టుకున్నారు. అది ప్రాణమున్నదయితే చాలాబాగుండేది.

ప్రకాశపిక్చర్సువారిది కళాదేవి ఆరాధన. ఆమె ధ్యానమగ్నయై యున్నది కనుక బాగానేఉంటుంది.

సాగర్ కంపెనీ పెద్దకంపెనీయే. వీరు మొదట లైట్హౌసుస్థంబాన్ని పెట్టుకొని, దానినితీసి మత్స్యకన్యను పెట్టుకున్నారు. అసలు బొమ్మను చూపిస్తే మంచిది అట్టి బొమ్మకంటె.

ఈస్టుఇండియావారు ప్రస్తుతము మన దేశములో ముందునడచే వారిలోనొకరు. వీరు E.I.F. మాత్రము పెట్టుకున్నారు. భవాని అజంతాకంపెనీవారుకూడ B.P. అని వ్రాసి Operatingmachine ఒక దానిని చూపిస్తారు. దేవకీబోసుల చిత్రపటాని కేమీలేదు. అప్పుడప్పుడు జాతీయపతాకముమాత్రము కనుపిస్తూ ఉంటుంది. వీరి ఫిల్ములు అన్నిరకాలుగానూ ఉంటాయి.

కమల్, సరోజ మూవీటోనులున్నాయి. వీరిద్దరకు కమలమే ట్రేడుమార్కు. సరోజకంపెనీ పైకి వచ్చింది. కదలుచున్న కమలము నుండి శబ్దము వెలువడును. శబ్దములు సరోజపిక్చర్సు అని అక్షరాలుగా మారిపోతాయి. చాలా బాగా ఉంటుంది.

ఇంకాచాలాఉన్నాయి అనుకోండి. కొన్నిటి కేమీలేదు. కొన్నిటికి పేరునుపట్టి బొమ్మఉన్నది. ఆంధ్రదేశములోకూడ నిలకడగా నున్నవి ఉన్నాయి.

ప్రభాత్లోకళ, న్యూథియేటర్సులో సంగీతము, బొంబాయి టాకీసులో మనోవిజ్ఞానము స్ఫురిస్తూ ఉంటుంది.

ప్రచారానికి ఉపయోగించే ట్రేడుమార్కులు తరువాత ముఖ్యమైనవి ట్రేడుషోలు, ప్రెస్సుషోలు. ఈ రెండును Distributors పని. వ్యాపారము ప్రారంభింప బోవునప్పుడు ఫిలుం వ్యాపారస్తులకు, తదితర అభిమానులకు దీనిని చూపించినపిదప విడుదల చేస్తారు. దీనిని ట్రేడుషో అంటారు. ప్రత్యేకము పత్రికాసంపాదకులకు, ప్రచారసంఘ సభ్యులకు, తదితర అభిమానులకు, కవులకు, రచయితలకు దీనిని చూపింతురు. వీరందరూ దీనిని చూచి దీని మంచి చెడ్డలను పత్రికలమూలముగా వెలిబుచ్చుదురు. వారివారి ప్రోత్సాహమువలన జనులెక్కువ దీనిని దర్శింతురు. కంపెనీ వారికి లాభము, చూచేవారికి ఆనందము.

ఇప్పటికి తీసేవారి యుద్దేశ్యము, తీసేవారు చూచేవారినెట్లా ఆకర్షిస్తారో తెలిపోయింది. సినీమాలో ఏముంటుందో చూడడానికే వారికి తెలిసిపోయింది. వీరి ఉ

యుల మనస్సులు ఏకములైపోతే ఆసినీమా ఎందుకు బాగుండదు? కాని యీరోజుల్లో సినీమా చాలా బాగుంది అనేవారు చాల తక్కువ ఉన్నారు. ఈతప్పు తీసేవారిలో ఉందా లేకచూచేవారిలో ఉందా? సినీమాచూచి కంపెనీవారిని సంతృప్తిపరచుట చూసేవారి కవసరమే. అందరిని సంతోషపెట్టడాని కాపరమాత్మునికే కష్టమంటారేమో, ఏదో చేతనైనంతవరకు ప్రయత్నించవచ్చునుగదా !

బాగావుండని సినీమాలకు ఆయువు తక్కువ. అందులో ఆంధ్ర దేశములో పుట్టిన ఏబది అరువది ఫిల్ములలో జనానికి జ్ఞాపకమున్నవి అయిదారుమాత్రమే. మిగిలినవి కీర్తిశేషమైకూడ ఉండలేదు పాపము. ఇందులకు కారణమేమైయుంటుంది? తీసేవారు చూచేవారిని మనసులో పెట్టుకొని తీయలేదు కనుకనే వానికి పతనము. రెండవది చేతిలోనున్న డబ్బును సద్వినియోగపరుప్పక పోవుట. మూడవది పాత్రలలో సత్ప్రవర్తన లేకుండుట. నాల్గవది డబ్బుచాలకపోవుట.

ఒక్కొక్కదాన్ని ఉదాహరణాలతో సహా వ్రాస్తే తంటావస్తుంది కనుక అంతాకలిపి మొత్తముమీద వ్రాస్తే ఫరవాలేదు. సినీమా తీయడానికి ప్రథమ ప్రయత్నములోనే లోపాలు జరుగుతూ ఉంటాయి. స్టార్లను వెదకడానికి ముందు వేలు ఖర్చుపెడతారు. అందరూ దొరికినతరువాత వారినిబట్టి కథ తయారుచేస్తారు. వారికిచ్చిన బజానాలు దండగకాకుండా కథ పూర్తిగా కాకుండానే షూటింగు ప్రారంభిస్తారు. అంటే అసలుకథ వ్రాసేవారికే ఎట్లామారుతుందో తెలియదు. ఇక డైరెక్టరుగారికేమి తెలుస్తుంది. ఈ లోపుగానే వస్తోంది అని ప్రచారము సాగుతుంది. డిస్ట్రిబ్యూటర్లు హాలువారివద్ద అడ్వాన్సులు పుచ్చుకుంటారు. వీరందరూ మోటార్లలో సరదాగా తిరుగుతూవుంటారు. కవులు, నటకులు అక్కడక్కడ విడివిడిగా ఉంటారు. వీరిని పిలచుకొనివచ్చుటకు మోటార్లు పోతూఉంటాయి. వ్రాసేకథ వ్రాస్తూవుంటే తీసేఫిల్ము తీస్తూఉంటారు. ఎక్కడైన కథ అడ్డముతిరిగితే ఆనెలజీతములు నష్టము. ఈచిల్లరబాపతులకే వేలు ఖర్చు అయిపోతాయి అనినమ్మండి. అంత ఉక్కిరి బిక్కిరిగా వ్రాసే కథకు సీక్వెన్సులు వ్రాసికొనుటకుగాని, డైరెక్షను నోట్సు వ్రాసికొనుటకుగాని డైరెక్టర్లకు సమయముండదు కనుక అప్పటి కప్పుడు తోచినప్రకారము చేయిస్తారు. అందువలన ఫిల్ము చెడుతుంది. మరల తీయిస్తారు. దీనిని Retakes అంటారు. తుదకు విసుగుపుట్టి ఏదో విధంగా నెట్టివేస్తారు. అప్పటికే కాలయాపన అయిపోతుంది. ఒకప్రక్క నటకులపోరు, రెండవ ప్రక్క డిస్ట్రిబ్యూటర్లపోరు. ఇంక సినీమా ఎందుకు బాగుంటుంది? ఇది ఇట్లాఉండగా ఇంకో క్రొత్త పద్ధతివచ్చింది. ఆరు నెలలలో ఒక ఫిల్ము తయారైతే, ప్రక్కప్రక్కన రెండు ఫిల్ములెందుకు తీయకూడదు అని కొందరు ప్రారంభించారు. రెంటికిని చెడిన రేవడిసామెత జ్ఞాపకమువస్తుంది ఇది వింటే!

మంచి నటకులను ఎన్నుకొనుట, కథ బాగా నడిపించుట, ఫోటోగ్రఫీ బాగా ఉండుట, శబ్దగ్రహణము బాగుండుట మొదలగు విషయాలు అన్నికలిస్తేకాని మంచిఫిల్ము -ఉపయోగమైన ఫిల్ముకాదు.

కొందరు సత్ప్రవర్తనలుగల నటీనటకులుండాలంటారు. మంచిదేగాని వారివలన లాభనష్టాలు తీసేవారికేగాని చూచేవారికేమియును లేదుగదా! చూచేవారు మంచి అభినయకళను చూస్తారు. పాత్రలతోపాటు కదలిపోతారు, తక్కిన సంగతులు చూచేవారి కనవసరము.

[ఇంకావుంది.]

## కొన్ని సాలీళ్లుకుడితే వణుకుబయలుదేరుతుంది, పిచ్చియెత్తుతుంది.

# సాలీళ్ల సృష్టిరహస్యం

సాలెపురుగు నిజంగా విషజంతువా ?

సృష్టిలో దానికి ఏమైనా ప్రయోజనంవుందా ?

సాలెపురుగుల్లో ఎన్నిరకాలు వున్నాయి ?

చిన్న సాలీడు శరీరంమీద ప్రాకితే చాలు ఆవ్యక్తికి కొత్త బట్టలు కట్టుకునే యోగం పట్టిందంటారుకొందరు పెద్దలు. స్పర్శ మాత్రాననే గొప్ప శుభయోగం కల్పించే ఆ కీటకరాజంయొక్క చరిత్ర తెలుసుకొనుట మంచిదికాదా?

కాని ఆకీటకం కొంచెం పెద్దదయితే చూచినమాత్రాన భయం, కంపం బయలుదేరతాయి. మానవులకు ఆ కీటకములందుగల సహజభయముచేతనే జీవశాస్త్రజ్ఞులుకూడా ఆ చిన్నపురుగు జీవితరహస్యమును కనుగొనుటకు శ్రమతీసుకొనలేదు. కాని ప్రకృతి పరిశోధకులు పక్షులలోను, శీతాకోకచిలుకలలోను వున్న రహస్యములు యీ భయావహకమగు సాలీడునందుకూడా వున్నవని నిరూపించారు.

సాలీడు శరీరము రెండుభాగములుగా విభజింపవచ్చు. ఒకటి హృదయకుహరము. రెండవది కడుపు. ఇవి రెండును సన్నటినడుముచే సంధింపబడినవి. దానికి ఎనిమిదికాళ్లు వున్నాయి. దానినోటికి రెండుప్రక్కలను విషపుతిత్తులున్నవి. ఆ తిత్తులనుండి రెండు పొడుగాటి కోరలున్నవి. కడుపునకు వెనుకభాగమున రెండుమొదలు నాలుగువరకు ఉన్నతమైన గుబ్బలున్నవి. వాటియందు దారము తయారగును. దానితోనే ఆపురుగు తనగూడును నిర్మించుకొనును. ఆడ సాలెపురుగు ఒకేసారి పెక్కుగ్రుడ్లను పెట్టును ఇందులో చిత్రమేమంటే ఆగ్రుడ్లన్నీ ఒక తెల్లటి సంచిలో సీలుచేయబడినట్లుండును. ఆసంచినే మనవారు సాలెబొడ్డు అంటారు. ఆబొడ్డు అందులోనున్న గ్రుడ్లపరిమితినిబట్టి మారును. శీతాకోకచిలుకలు మొదలైన కీటకములవలె ఇవి చిట్లగానే వేరు రూపమును పొందక నిజమైన తమ తల్లిదండ్రులరూపమునే పొందును.

ప్రపంచమందు సాలెపురుగులు వ్యాపించినంతగా మరి యేప్రాణి వ్యాపించియుండలేదు. నీ వేమూల చూచినా నీ కంటికి గోచరించేది సాలిపురుగో, దానిగూడో! చీకటికోణంకానీ బాగా వెలుతురుకల తోటలలో కాని చెట్లమీద, చెత్తలోను చలి ప్రదేశము, వేడి ప్రదేశము అను వ్యత్యాసం లేదు. అన్ని ప్రదేశములందు సాలీడు ప్రత్యక్షమౌతుంది.

సాలీడు ప్రవర్తన, నిర్మాణము, కడుచిత్రమైనవి. సాలీళ్ళలో చిన్న పక్షులంత పెద్దగా వుండేవికూడా వున్నాయి. అంతేకాదు. అణువులంత చిన్నవికూడా వున్నవి. అందులో కొన్ని అద్భుతమైన వర్ణములు కలవికూడా వున్నవి. కొన్ని సామాన్యముగా బూడిదరంగు కలిగియుండును. కొన్ని శ్రమపడి విచిత్రమైన గూడును కట్టుకొంటూవుంటే కొన్ని సోమరిపోతులు గూళ్లు లేకుండా వుంటాయి. సాలీళ్ళలోకూడా సంసారసాంఘికఅన్యోన్యత కలవి వున్నాయి. రాక్షసకృత్యాలు చేసేవీ వున్నాయి. వాటిలో నిపుణతగల వేటగానిపనిచేసేవి వున్నాయి. వెక్కిరించేవి వున్నాయి. గృహనిర్మాణమందు ఆరితేరినవి వున్నాయి. అద్భుతముగా ఈత ఈదేవి వున్నాయి.

సాలెపురుగులలో స్త్రీజాతివి

మహాదారుణమైనవి. అవి సర్వకాల సర్వావస్థలయందు మొగుడితో పోరాడుతూనే వుంటాయి. మొగపురుగు లేకండా బ్రింగేద్దామనే వాటియుద్దేశము. అట్టిబ్రహ్మరాక్షసత్వంగల ఆడసాలీళ్ళతోనే కాపురం చేస్తున్నాయి ఆమగ సాలీళ్లు.

ఈసాలెపురుగులలో వందరకాలువున్నాయి. అందులో ఒకదానిని పోలి యింకోజాతి వుండదు.

ఈజాతులలో Argyopids ఒక జాతి. వాటిగూడు చిత్రంగా నిర్మించుకుంటాయి. ఆగూడు గుండ్రని వల ఆకారముగా వుంటుంది. ఆ గూటిదారములు పట్టువలె మెరుస్తాయి. ముట్టుకుంటే అంటుకుంటాయి. అంటే ఆదారములకు ఒక జిగురు పదార్థము పూయబడివుందన్నమాట. ఏదేనా యీగగాని, పురుగుగాని తాకినచో అది తిరిగి తప్పించుకొనలేదు. టెలిగ్రాఫ్‌తీగలకన్న అతిత్వరితముగా దారములు ఆవార్తను గూడుమధ్య కొంగజపంచేస్తున్న సాలీడుకు అందచేస్తాయి.

వెంటనే ఆసాలీడు ఉగ్రనరసింహావతారంతాల్చి పరుగునవచ్చి ఆ పురుగును మరికొన్ని దారములతో బంధించేస్తుంది. తరువాత మెల్లిగా దానిని భోజనంచేస్తుంది. ఏదైనా బలీమైన శత్రువు తన గూటిని సమీపించినచో గూడును విడిచి క్రిందకుదూకి చావు తప్పించుకొంటుంది.



Lycosa Pantherina అనేరకపు సాలెపురుగు హిందూదేశములో సర్వసాధారణమైనది. అవి చెట్లకొమ్మలలో, రాళ్ళలో విచిత్రమైన గూడు నిర్మిస్తాయి. ఆగూడు ఒక సొరంగములా వుంటుంది. దానికి రెండువైపులా దారి వుంటుంది.

కొన్నిరకముల సాలీళ్లు యిల్లు లేకుండానే కాలం గడిపేస్తాయి. కాని పిల్లలను పెట్టేకాలమందు మాత్రం గూడుకట్టుకుంటాయి. కొన్నిసాలీళ్లు ఆకులను చుట్టిగాని, ఆకుల క్రిందిభాగమున గూడునిర్మించిగాని జీవిస్తే మరికొన్ని రాతి గుంటలలోను, చెట్టు తొర్రలలోను, గోడనెరదలలోను కాలం గడిపేస్తాయి.

Stegodyphus అనేజాతి ఒకటి వుంది. ఆజాతి ఘనత ఏమంటే వలసరాజ్యాలు ఏర్పరుచుకొనుటలో మంచి నేర్పువుండడం. మిగతా సాలీడురకాలన్నీ తమలో తాము దొమ్ములాడు రకాలే.

Eresid సాలీళ్లు వందలకొద్దీ సంచీలాంటి గూటిలోనే వుంటాయి. ఆలాంటి పెద్దపెద్ద సాలెగూళ్లు చెట్లకొమ్మలయందు వుంటూ వుంటాయి. లేక కంచెలమీద కూడా కనుపిస్తాయి. ఏపురుగేనా వాటికి పట్టుబడితే అవి అన్నీ సమానంగా పంచుకుతింటాయిట. ఆహా! ఏమి సామ్యవాదము!



నీటిసాలీళ్లు అనేవి మరొరకం. ఇవి నీటివడ్డునవుండే కన్నాలలో వుంటాయి. శత్రువు సమీపిస్తే నీటిలోనికి పారిపోతాయి. ఆశత్రువు దానిని వెంటాడితే చచ్చిపోయినట్లు నటిస్తాయి. దానికాళ్లు ముడుచుకుని నీటిమీద తేలిపోతాయి. వాటికి నీటిపురుగులే ఆహారము. ముఖ్యముగా ఇవి ఈగ, దోమ మొదలైనవాటి గ్రుడ్లను, పిల్లలను పొట్టన పెట్టుకుంటాయి. అంతే కాకుండా అప్పటప్పట చిన్న చేపపిల్లనుకూడా కాజేస్తాయి.

ఆత్మరక్షణకోసం భగవంతుడు ఆ పురుగులకుకూడా కొన్ని రక్షణాలు ఏర్పరచినాడు. కొన్ని సాలీళ్లు ఆకుపచ్చగా వుంటాయి. అట్టివి సర్వసాధారణముగా చెట్లకొమ్మల్లో వుంటాయి. ఆకులక్రింది భాగమున వుంటాయి. కాగా ఆరంగులో లీనమైపోయి, శత్రువునిదృష్టి నుండి తప్పించుకుంటాయి. బూడిదరంగుకల సాలీళ్లు చెట్లబెరడులో, పాతగోడల బిగటలందు దాగివుంటాయి. అవి కాళ్లుజాపి బెరడును గట్టిగా కౌగిలించుకొని వుంటాయి. అందుచేత మిక్కిలిజాగ్రత్తగాచూచేవాడుకూడా వాటిని చూడలేక పోవచ్చు. కొన్ని సాలీళ్ళకు చిన్న

శరీరము పెద్దకాళ్ళు వుంటాయి. ఆ లాంటివి గబగబా పరుగెత్తి గడ్డి పరకలలో దాక్కుంటాయి.

❦

Oxyopids అనే సాలీడుజాతికి వంటినిండా నూగువుంటుంది. అవి పంటచేలయందుంటే కనిపెట్టటం కష్టం.

కొన్ని సాలీళ్లు పువ్వులలో కాళ్లు పైకిఎత్తి వెల్లకిలా పడుకుంటాయి. ఆకాళ్ళనుచూచి కింజల్కాలని భ్రమించుటకూడా కలుగుతుంది.

❦

ప్రకృతిలోనున్న అన్నిరంగులను ఉపయోగించి యీ క్షుద్రమైన జీవరాసిని సర్వవిధముల సంరక్షించాడు ప్రకృతిపురుషుడు 'సాలీళ్ళరంగులో పచ్చ, నీలము ఆకులలో దాగొనుటకు- ఎరుపు, పసుపు పువ్వులలో ఐక్యమగుటకు- నలుపు, బూడిదరంగు గోడలందు, రాళ్ళయందు తల దాచుకొనుటకు ఉపయోగాలయినవి. ఇంతేకాక తమ రంగుచూపి ఇతరులను భయపెట్టే సాలీళ్ళుకూడా వున్నాయి.

అనుకరణలో కీటకముల తరువాత సాలీడు అగ్రగణ్యమైనది.

Lycosids అనే జాతి సాలీళ్లు ప్రవర్తనలో ఈగలను అనుసరిస్తాయి. కొన్ని ముఖముమీదిపోతరం బొట్టిమెలవలె కనుపిస్తాయి. కొన్ని చెట్ల కొమ్మమీది గుంపువలె గోచరిస్తాయి. సాలీళ్ళలో చీమలను పూర్తిగా పోలునవికూడా వున్నవి. కాగా అజాతి సాలీళ్ళు చీమలతో కలిసిమెలసి తిరుగుతూ శత్రువు నుండి తప్పించుకొంటాయి.

❦

'రాబర్టు బ్రూస్, వాని సాలీడు' అను యింగ్లీషుకథ చదివినవారికి అందరికి సాలీడుయొక్క శక్తి, ఓర్పు బాగుగా తెలిసేవుంటుంది. తన ఆహారమును వేటాడుటకిని ఆసాలీడు ఎంతటి నిపుణతచూపునో వివరించడంకష్టం. అది డాక్టరు ఆపరేషను చేసేటప్పుడుచూపే జాగ్రత్తకంటె అతిజాగరూకతతో తన ఆహారమునుపట్టి భక్షిస్తుంది.

గూటిలో చిక్కిన కీటకము మీద మెఱుపుతీగలాగ పడి సూదులవంటి కోరలతో పొడిచి తన విషమును ఇంజక్టుచేసి ఆకీటకమును చంపేస్తుంది. అటుతరవాత దాని శరీరములోని రక్తమాంసములను పీల్చేస్తుంది.

సర్వసాధారణముగా సాలీడు విషపుపురుగనిజనులతలంపు. కాని అన్నిసాలీళ్లు విషపు పురుగులు కావు. కొన్ని నిజముగా విషపూరితములే. అట్టి సాలీళ్లు కరచినచో మనిషికి చాలాబాధ. వీటిలోనే పురికోస అని ఒకజాతివుంది. అది కుడితే మరి మందులేదు. కొన్ని సాలీళ్లు కుడితే వణుకు బయలుదేరుతుంది. పిచ్చిఎత్తుతుంది. ఆ పిచ్చి పాటలు పద్యాలతోనే కుదరాలి కాని వేరు మార్గం లేదుట!

❦

ఈసాలీళ్ళలో మానవునకు ఉపయోగించేవికూడా వున్నాయి. ఈ పురుగులను ఈదేశంలో మందు మాకులలో ఉపయోగించుచున్నట్టుకూడా తెలియుచున్నది—ఆ మందులు ఎట్టివంటి? నివారణకావనుకునే చర్మరోగాలయందు యీ పురుగులతో తయారుచేయబడిన తైలమును ఉపయోగించిన అచిరకాలమునందే నివారణఅగును—పొలములందుండే సాలీళ్లు పంటచేల మీది కీటకములను మ్రింగి సేద్యగానికి అపారసేవ చేయుచున్నవి. గోసమర్ సాలీడు తయారుచేయు దారమును ఖగోళశాస్త్రజ్ఞులు తమ టెలిస్కోపులకు ఉపయోగించుచున్నారు.

ఉపయోగమున్నా లేకపోయినా సాలెపురుగును చూచి భయపడవలసిన కారణము లేదు. పైకి చూస్తే చాలా మోసంచేసేవిగా కనిపించినా వాటిని అతిజాగ్రత్తగా పరిశీలిస్తే వానివద్ద ప్రకృతిలోని శోభ ప్రతిబింబించును. అతిక్షుద్రమైన ఆ కీటకము అత్యద్భుతమైన విషయములను బోధించును. మనము చూచినకొద్దీ ఆ జీవిలో ఇమిడివున్న చిత్రములు విశేషంగా మనకు తెలుస్తూవుంటాయి.

# లోకసత్యాలు

## (లంచగొండితనపు కథలు)

మధ్యపానసమస్యని, జమీందారీరైతు సమస్యని, హారిజనదేవాలయ ప్రవేశసమస్యని జయప్రదంగా పరిష్కరింపగలిగిన మదరాసు ప్రభుత్వం తలుచుకుంటే లంచగొండితనపు నిర్మూలన సమస్యని సవ్యంగా పరిష్కరింలేకపోదు.

రచయిత:

**భావరాజు నరసింహారావు**

౧

[సాయంత్రం 5 గంటలకు. గవర్నమెంటు పెద్ద ఆసుపత్రి ఆవరణలో. రక్త సిక్తమైన గుడ్డలతో, విరిగిపోయిన కాలుతో పన్నెండు సంవత్సరాల పిల్లవాడు సవారీలో స్పృహలేకుండా పడివుంటాడు. పదిమంది మనుష్యులు చుట్టూ దీనవదనాలతో నిలబడివుంటారు. పెద్ద డాక్టరు (జిల్లాసర్జను) వస్తాడు. ఆ పదిమందిలో వొకాయన వచ్చి డాక్టరుకు నమస్కరించి—]

వ్యక్తి:—అయ్యా! నీళ్ళపీపాపడి, పిల్లాడికాలు విరిగిపోయిందండి. పదిమైళ్ళనుంచి మోసుకొచ్చాం. తమరు కనికరించాలి బాబూ!

డాక్టరు:—ఇప్పుడు వీల్లేదు. ప్రొద్దునదా, తీసుకురా.

వ్య:—బాబూ! (గుడ్లనీరు కుక్కుకుంటూ) వంశానికి మిగిలిందొక్కడు. ప్రాణం రక్షించి తమరు పుణ్యంకట్టుకోవాలి.

డా:—నీకుదా, చెప్పలేదా? నిండా పని వుంది, యిప్పుడు. వొక గంట ఆగండి. వీలు ఉంటే...

వ్య:—చూడండిబాబూ! నెత్తురు కాలవగట్టి పాఋతోంది. గంటదాకావుంటే .. పిల్లాడు దక్కడనే భయమేస్తోంది. అయ్యా! మాయిల్లు నిలబెట్టండిబాబూ! (వంగి కాళ్ళుపట్టుకోబోతాడు)

డా:—(కాళ్ళు ఎడంగాతీసుకుని, వెంటవున్న చిన్నడాక్టరు వంకసాభిప్రాయంగా చూస్తూ, సాగిపోతాడు)

వ్య:—(ముఖంమీద గుడ్డ వేసుకుని భోరున యేడుస్తూంటాడు)

చిన్నడా:—ఏడుస్తా వేమయ్యా, పిచ్చివాడా? ఏడుపులతో పనులవుతాయా? (ప్రక్కకుపిలిచి-మెల్లిగా) వొక్క [illegible]వందల రూపాయలు వారికి[illegible] పిల్లవాణ్ణి ఆయన చేతుల్లో[illegible] పెట్టు (పిల్లవాడినాడి పరీక్షించి, పిల్లవాడిస్థితి ఏమాత్రం ఆశాజనకంగా లేదని గ్రహించికూడా) పిల్లవాడు నీరసిస్తున్నాడు. ఆలస్యంచేస్తే దక్కడు. ఊఁ! త్వరగా కానియ్య.

వ్య:—అయ్యా! రెండు రూపాయిలుకూడా యిచ్చుకోలేని నిర్భాగ్యుణ్ణి, రెండువందలు ఎల్లా యివ్వగలను? కూటికిలేని దరిద్రులం మాదగ్గరేముంటుంది బాబూ? (ఇంకా ఏడుస్తూ) బాబుగారూ! మీరన్నా మాయిల్లు నిలబెట్టండి, మీకాళ్ళట్టుకుంటా........

చిన్నడా:—కాళ్ళట్టుకుంటేనూ, వేళ్ళట్టుకుంటేనూ యిక్కడ పనులుకావు. ఏదోవిధంగా తంటాలుపడి త్వరగా డబ్బు తీసుకురా—ఆలస్యంచేస్తే... నీకే కష్టం...

వ్య.—నన్నమ్మినా పది రూపాయలు రావు బాబుగారూ! ...

మీరే దేవుళ్ళు ... బాబూ ! రక్షించండి...(ఏడుస్తాడు)

చిన్న డా :—(పిల్లవాడి నాడిచూచి) నువ్విల్లాగే ఏడుస్తూ కూర్చో, పిల్లవాడు కాస్తా...

(డాక్టరు వెళ్ళిపోతాడు. చేసేది లేక యిద్దరు మనుష్యులు చేతులు పలుపుకుంటూ డాక్టరు వెంట వెళ్తారు. మిగతావాళ్ళు చూస్తూండగానే కుర్రవాడు గుడ్లు తేలేస్తాడు. అందరూ ఘొల్లుమంటారు. 'ఇంత దుండగిం జరిగిందా?' అనుకుంటున్నట్లు, జేవురించిన ముఖంతో, సూర్యుడు పశ్చిమాద్రిని దిగిపోతాడు).

౨

[ఆదివారం. ఉదయం 8 గంటలకు. హెడ్‌మాస్టరుగారు గదిలో కూర్చుని కాంపొజిషన్ పుస్తకాలు దిద్దుకుంటూంటారు. ప్రవేశం ఒక వ్యక్తి.]

వ్యక్తి:—నాయుడుగారూ! నమస్కారం.

హె.మా:—ఓహో! శర్మగారా? నమస్కారం. (లేచి) దయచెయ్యండి...ఏమండీ, విశేషాలు? ఇల్లా దయచేశారు ?

శర్మ:—ఏంచెప్పమంటారు? (చేతులోని పుస్తకం చూపుతూ) ఈ పుస్తకం ఎన్నాళ్ళనుంచీ ఉపయోగిస్తున్నారు, మీబడిలో?

హె.మా:—(చూచి) ఇదా? నిరుటినుంచీ నండి.

శర్మ:—మీరు కోపగించకండి, నే చెప్పబోయేదానికి ... అయితే యీపుస్తకంచదివి మాపిల్లలు బాగుపడాలనేనా దీనిని ఉపయోగించటం? రామ, రామ! అదెక్కడి భాషండీ? ఆంధ్రదేశం యావత్తూ—బరంపురం దగ్గరనుంచి, బళ్లారివరకూ - పూర్తిగా సంచారం చేశానుగాని, యీలాటి భాష మాట్లాడేవాళ్ళనూ, వ్రాసేవారినీ చూళ్ళేదండీ. అది ఆంధ్రుడెవ్వడూ అర్థంచేసుకోలేని భాషగా ఉంది...నిన్నరాత్రి మాకుర్రవాడు చదివి, వాడికి అర్థంకాక నన్ను చెప్పమన్నాడు. తీరా చదువుదునుకదా ఒక్క ముక్క కూడా సరీగా అర్థంకావటం లేదు...ఇంతకూ యీ దిక్కుమాలిన పుస్తకం మీరుచూచి నిర్ణయించిందేనా ?

హె.మా:—అయ్యో! ఏం చెప్పమంటారు? కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. ఈ పుస్తకాలు నిర్ణయించే అధికారం మాచేతుల్లో లేదు. అదంతా ప్రెసిడెంటుగారి దయమీద ఆధారపడి వుంటుంది.

శర్మ:—పోనీ, ఆయనైనా చదువుకున్నవాడే కదా, భగవంతుడిచ్చిన జ్ఞానం ఉపయోగించక్కరలేదండీ? ఆంధ్రరాష్ట్రం కావాలనీ. ఆంధ్రభాష నుద్ధరించాలనీ పెద్దపెద్ద ఉపన్యాసాలిస్తాడు—చివరికి తాను ఆంధ్రేతరుడు వ్రాసిన తప్పులతడక తెలుగు పుస్తకాన్ని నిర్ణయిస్తాడా ?

హె.మా:—ఆ అభిమానం ప్లాటుఫారంవరకే. కాబట్టి దాన్ని అలావుంచండి. ప్రస్తుతం ... (రహస్యంగా) ఎవరితోటీ అనకండి, మనకెందుకొచ్చిన రొష్టు, ఆకంపెనీవాళ్లు... పుష్కలంగా ముట్టజెప్పారట. అదీ కారణం...

శర్మ:—ఇందులో దాపరికమేముందీ- లోకమంతా కోడై కూస్తుంటే? ఆ నాలుగువేలూ పెట్టి కారు కొన్నాడుగా !

హె.మా:—ఆఁ! అదే, అదే! ... అంతేకాని యీరోజుల్లో పుస్తకాలబాగు, పిల్లలబాగు ఎవడిక్కావాలండీ?

శర్మ:—అయ్యో! ఎంతఘోరంగా వున్నది! జిల్లాబోర్డులన్నీ ఆక్రమించుకుని, మన కాంగ్రెసువాళ్ళే...కంచే చేనుమేసి ... ...నట్లుంది.

హె.మా:—అన కూడదుగాని, యింకా అధ్వాన్నంగా వున్నదండీ.

శర్మ:—అందుకే మహాత్ముడు చెవిని యిల్లుకట్టుకు గోలపెడుతున్నాడు—మన కొంపల్లో దొంగలు దూరారని !

* * *

అయ్యో! ఇరవయ్యో శతాబ్దంలో కాంగ్రెసు శకంలో మనకు ఎదురయ్యే ఘట్టాలు యివి! ప్రజా

ప్రభుత్వమైన కాంగ్రెసు ప్రభుత్వోద్యోగులుకూడా యీవిధంగా ప్రవర్తిస్తున్నందుకూ, అన్యాయపథంలో వారి ఈ ధైర్యసాహసాలకూ మనకు నిజంగా విస్మయం కలగక మానదు. పైనఉదహరించినవి మచ్చుకుమాత్రం. ప్రభుత్వంలో ఏ శాఖనైనా పరీక్షించండి, యిల్లాంటి అనౌచిత్యాలు పుంఖాను పుంఖాలుగా, అడుగడుక్కీ, నిముష నిముషానికీ మనల నెదుర్కొంటాయి.

పోలీసు శాఖలో పద్ధెనిమిది రూపాయిల జీతం పుచ్చుకునే పోలీసు జవాను దగ్గరనుంచీ, యెనిమిదివందల జీతంగుంజే సూపరింటెండెంటువరకూ చేయిజాచని వాడు ఉండడనటం అతిశయోక్తి కాదు.

ఇన్‌కంటాక్సు శాఖ చూడండి. నోటీసులు అందజేసే నౌకరు మొదలుకొని, పన్ను విధించటానికి సర్వహక్కులనూ కలిగిన ఆఫీసరువరకూ, కొద్దో గొప్పో కతకకుండా వుండేవాడు,లేడంటే ఆశ్చర్యం లేదు.

ఎక్సైజుశాఖను పరిశీలించండి : ఒక్కొక్క తాలూకాలో ఎన్ని వేల తాడిచెట్లున్నాయో అన్ని వేలకూ చెట్టుకు వొకటో, రెండో రూపాయలు చొప్పున వెంకటేశ్వరస్వామి ముడుపుల్లాగ పుచ్చుకునే ఉద్యోగి లేడనటం సత్యదూరం కాదు.

విద్యాధికులై, భావిభారత విజ్ఞానానికి పునాదులు వేయవలసిన విద్యాశాఖలోని ఇన్‌స్పెక్టర్లను తిలకించండి—స్కూల్ ఇన్‌స్పెక్షనుకని వెళ్ళి, గవర్నమెంటువారి వద్దనుంచి కావలసినంత భత్యపు బిల్లులు గుంజుతూ, ప్రాథమికోపాధ్యాయుల యిళ్ళలో గారెముక్కలకుకూడా కక్కుర్తిపడేవారు లెక్కకు మిక్కుటంగా వున్నారు. రోజువారీ భత్యపుబిల్లులక్రింద ముట్టే వందపైచిలుకుగాక, నెలకు అయిదారువందల రూపాయలజీతం పుచ్చుకుంటూ, ట్రయినింగు విద్యార్థులకు స్కూలులో ప్రవేశమిచ్చేటప్పుడు, వొక్కొక్క విద్యార్థిదగ్గరనుంచి వొకనెల స్టయిపెండుగాని, అధమం అయిదురూపాయిలుగాని నిర్బంధంగా వర్షాజనం వసూలు చేస్తున్న జిల్లా విద్యాశాఖాధికారులనుకూడా చూస్తున్నాము.

ఇవిగాక మ్యునిసిపాలిటీల, జిల్లా బోర్డుల కంట్రాక్టులలో అయాచితంగా, లోపాయకారీగా ఇవ్వబడే లంచాలు ఎప్పుడూ నేలసంఖ్య మీదనే ఉంటాయని వేరే చెప్పనక్కర లేదుకదా! వీటన్నిటినీ తలదన్నే రైల్వేశాఖనుగురించి ముచ్చటించాలంటే వేరే గ్రంథం రాయటం సమంజసం!

చివరకు చూడగా 'యీ లంచగొండితనమూ, రంకుతనమూ ఎన్ని భగీరథప్రయత్నాలుచేసినా, ప్రకృతితోపాటు పెరుగుతూనే వుంటవా?' అని నిస్పృహకూడా కలుగుతుంది.

కాని కొంచెం జాగ్రత్తగా ఆలోచిస్తే మళ్ళీ కొంతధైర్యం కలగకపోదు. బీహారులోనూ, సింధులోనూ యీ దుర్నయాన్ని అరికట్టడానికి ఆప్రభుత్వాలు చాలా తీవ్రమైన కృషిచేస్తున్నట్లు తెలియవస్తోంది. సింధులో వొక [illegible] బోర్డు అధ్యక్షుణ్ణీ, వొక మ్యునిసిపల్ ఛైరుమనునూ లంచాలు పుచ్చుకున్నందుకు స్థానభ్రష్టుల్ని చేశారు.

కాని ప్రభుత్వం యీవిషయంలో యెన్ని కట్టుదిట్టాలుచేసినా, ప్రజలలో సరిఅయిన సంచలనం కలగకపోతే, యీశ్రమంతా అడవిగాచిన వెన్నెలవుతుంది. అంచేత, ముందుగా నోటీసులద్వారానూ,

పత్రికలలోనూ, ఉపన్యాసాలవల్లనూ, రేడియోమూలంగానూ ప్రజలకు ఉద్బోధ చేయాలి.

ప్రజలకు ప్రభుత్వోద్యోగులంటే ఉన్న మూఢభయంపోయి, ప్రభుత్వోద్యోగులు ప్రజల సొత్తువల్ల బ్రతికే ప్రజాసేవకులనీ, అందుకుగాను వారికి ప్రభుత్వంవారు జీతాలిచ్చి పోషిస్తున్నారనీ, కాబట్టి వారుచేస్తున్న పనులు వారు విధిగా నిర్వహించవలసినవేగాని, అవి తమకు యేవిధమైన మెహర్బానీలు కావనిన్నీ, అల్లాటి పనులు చేస్తున్నందుకు లంచాలివ్వటం చాలా తప్పనీ, తెలివితక్కువనీ బోధపరచాలి.

ఇంకొక ముఖ్యవిషయం ప్రభుత్వంవారు గమనించాలి. అసలు యీలంచగొండితనం ప్రబలటానికి ముఖ్యమైన కారణాలలో తక్కువ జీతాలొకటి. అంచేత బాగా ఎక్కువ వేతనాలు పుచ్చుకుంటున్న వారికి కొంత తగ్గించి, బాగా తక్కువ జీతాలవారికి హెచ్చుచేయటం అవసరం. తర్వాత పెద్ద అధికారి, తనచేతిక్రింద పనిచేస్తున్న చిన్న ఉద్యోగిని లంచంపుచ్చుకున్నాడని నిర్భయంగా చెప్పగలడుగాని, ఆచిన్నఉద్యోగి తనపై అధికారిమీద నేరం ఋజువుపర్చడానికి సహజంగా జంకుతాడు. కాబట్టి, ప్రభుత్వంవారు అలాటి నేరాలను నిపుణులైన ప్రత్యేక సి. ఐ. డీ. ల ద్వారా ఆరాను తీయించి, తగు శిక్షలను విధించటానికి యేర్పాట్లు చేయాలి. ఆశిక్షలలోకూడా ఊరికే ఉద్యోగంనుంచి తొలగించి విడిచిపెట్టక, బాగా తీవ్రమైన, కఠినమైన శిక్షలను వేయాలి. ఆ శిక్షలను విధించటంలోకూడా ఉన్నతోద్యోగి, చిన్నఉద్యోగి అనే భేదాలకు తావివ్వకుండావుండాలి.

* * *

భారతదేశంలోకల్లా బహుళంగా దేవాలయాలు కలిగి, సనాతనులకు ఆదిపీఠమని పేరొందిన దక్షిణదేశంలో హరిజనులకు ప్రసిద్ధదేవాలయాలలో ప్రవేశమిప్పించటం సామాన్యవిషయంకాదు.

హిందూదేశంలోకల్లా (సంయుక్తరాష్ట్రాలు మినహాగా) మిక్కుటంగా జమీందారులుగల ప్రదేశం మన ఆంధ్రదేశం. అల్లాటిచోట ప్రబలిఉన్న జమీందారులను ప్రతిఘటించటం తేలికఅయిన పని కాదు.

'ప్రపంచ సిద్ధాంతాల ప్రకారం పాన పిశాచాన్ని అంతమొందించటం కలలోనివార్త' అని వేనోళ్ళ చాటుతున్నా, గాంధీమహాత్ముడి ఆశీస్సులతో ప్రొహిబిషన్‌ను ప్రవేశపెట్టటం నిజంగా సాహసమైనపని.

ఇల్లాంటి రివల్యూషనరీ పనులను చేయగల్గిన మన మద్రాసు ప్రభుత్వానికి 'యీలంచగొండితనాన్ని రూపుమాపటం అంత కష్టంకాదు. అందుకు త్వరలోనే తగిన ప్రయత్నాలు చేయగలరని, అప్పుడు పై విషయాలు విస్మరించరనీ విశ్వసిస్తున్నాము.

# నన్నెచోడకవికాలము

## (పెద్దచెరుకూరు శాసనాధారము)

[కుమారసంభవ కర్త నన్నిచోడుడును, మహాభారతకర్త నన్నియభట్టును సమకాలికులని ఈవ్యాసకర్త లోగడ ఈపత్రికలో నిరూపించివున్నారు. ఆ వ్యాసాన్ని విభూతి పత్రిక ఎత్తి ముద్రించింది. దానికి శ్రీ బండారు తమ్మయ్యగారు విమర్శ వ్రాసారు. పలువురు ఇతర పండిత ప్రకాండుల దృష్టికూడా దాని మీద పడింది. నన్నిచోడకవికాలము పూర్వాదావృతమైనదేఅని ఇప్పుడు ఈవ్యాసంలో ఇంకా సమర్థింపబడుతూవుంది. —సంపాదకుడు.]

రచయిత:

దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

(ఆంధ్రవిశ్వకళాపరిషత్సభ్యుడు)

ఆంధ్రకుమారసంభవ మందలి చోడబల్లి వంశమునకును, పెద్ద చెరుకూరుశాసన (పెద్ద చెరుకూరు దేవునికి పరిదపూండి అను గ్రామమును దానము చేయబడినట్లు చెప్పు శాసన)మందలి చోడబల్లి వంశమునకును భేదములేదని (ఆంధ్రభాషాతత్వనిదర్శన కాలవేత్త లోకరిద్దరుతప్ప) చారిత్రకులంగీకరించియున్నారు. కాని, పరిదపూండి దానకాలము పెద్దచెరుకూరు శాసనములో లేనందువల్ల; చోడబల్లి తనూజుడయిన నన్నిచోడకవి కాలనిర్ణయములో చారిత్రకులు భిన్నాభిప్రాయము కలవారై యున్నమాట వాస్తవము.

నన్నిచోడకవి తన జానుతెనుగు కుమారసంభవములో "గూఢవస్తుమయకావ్యము"గా వ్రాసిన తత్ప్రబంధరచనాకాలమును బట్టి, కాకతీయ గణపతి సామంతుడయిన మల్లిదేవచోడుని పెద్దచెరుకూరు శాసనకాలమును సప్రమాణముగా నిర్ణయించవచ్చునని నాకు తోచుచున్నది. దగ్గాంబికానందనుడయిన మారాయన ఆదిలో ఇక్షుగ్రామాగ్రహార (ఇదే పెద్దచెరుకూరు) మందలి భీమేశ్వరునికి పరిదపూండిని దానము చేసెననియు, గణపతి దీనిని "పునః" దానము గావించెననియు, శ్రీమన్మహామండలేశ్వర మల్లిదేవ చోడమహారాజు దీనిని 'వీరరాజేంద్ర కాకతియ్య గణపతి మహాక్షోణీశు'నికి "ధర్మార్థము"గా (పుణ్యముగా) శాసనము చేసెననియు పెద్దచెరుకూరు-శాసనమందలి పరిదపూండి దానచరిత్ర చెప్పుచున్నది దీనినిబట్టి, మల్లిదేవ చోడరాజు కాకతీయ గణపతిదేవునికి సామంతుడుగానుండెనని చెప్పకతప్పదు.

ఇక, పెద్దచెరుకూరు శాసనములో పరిదపూండి దానకాలము లేకపోయినప్పటికిని, కాకతీయ గణపతిదేవుని యన్యశాసనకాలమును బట్టి, పెద్దచెరుకూరు శాసనకాలమును నిర్ణయించుట కవకాశమున్నది. కాని కొన్నిచిక్కులును లేకపోలేదు. ఇందువల్లనే చారిత్రకులు భిన్నాభిప్రాయములు కలవారగుట కవకాశమేర్పడినది.

ఆంధ్రకుమారసంభవ మందలి చోడబల్లితనూజుడయిన నన్నిచోడదేవ కవిరాజు కాలమునుబట్టి, పెద్దచెరుకూరు శాసన మందలి చోడబల్లి కుమారుడయిన నన్నిచోడునికాలమును, తద్వంశజుడైన పెద్దచెరుకూరు శాసన నిర్మాత మల్లిదేవచోడుని కాలమును నిర్ణయించవచ్చును. పరిశీలింపుడు.

# పెద్దచెరుకూరు శాసనమందలి నన్నిచోడకవికాలము:

| ఆంధ్రకుమార సంభవమందలి చోడబల్లి వంశము. | ఆంధ్రకుమారసంభవమందలి గూఢ వస్తుమయ కావ్య రచనా కాలము (క్రీ. శ. 1054) నుండి తరమునకు 30 సంవత్సరముల లెక్కను. | పెద్దచెరుకూరు శాసనమందలి చోడబల్లి వంశము. | కాకతీయ గణపతి ప్రథమ దానకాలము (క్రీ. శ. 1202 పిల్లలమర్రి శాసనకాలము) నుండి తరమునకు 30 సంవత్సరముల లెక్కను. |
|---|---|---|---|
| చోడబల్లి ... | 994–1024 | చోడబల్లి ... | 994–1024 |
| నన్నిచోడుడు ... | 1024–1054 | నన్నిచోడుడు ... | 1024–1054 |
| | | నూరభూపతి ... | 1054–1084 |
| | | * ఘటంకారుడు ... | 1084–1114 |
| | | మల్లిదేవుడు ... | 1114–1144 |
| | | నన్నిచోడుడు ... | 1144–1174 |
| | | మల్లిదేవుడు ... | 1174–1204 |

* ఘటంకారుని సోదరుడు రాజరాజచోడుడు.

పై పట్టికయందలి చోడవంశీకుల కాలమునుబట్టి, పెద్దచెరుకూరు శాసనము : కాకతీయగణపతి రాజ్యారంభకాలములో, ప్రకటింపబడినదని చెప్పకతప్పదు. దీనినే మరియొక విధముగా చెప్పదలచిన పక్షమందు కాకతీయ గణపతిదేవుని సామంతుడయిన మల్లిదేవచోడరాజు (తన రాజ్యాంతిమ కాలములో) తన ప్రభువునకు ధర్మార్థముగా పెద్దచెరుకూరునందలి భీమేశ్వరస్వామికి పరిదపూండిని దానముచేసి, శాసనము చెక్కించినాడని చెప్పవచ్చును.

ఇక నాంధ్రకుమారసంభవమందలి (క్రీ. శ. 1054) చోడబల్లి కుమారుడయిన నన్నిచోడదేవ కవిరాజును, పెద్ద చెరుకూరు శాసనమందలి (క్రీ. శ. 1024–1054) చోడబల్లి తనూజుడయిన నన్నిచోడుడును క్రీ. శ. 11–వ శతాబ్దమందలి సమకాలికులని నిస్సందేహముగా చెప్పవచ్చును.

కనుకనే, నన్నిచోడ కవిరాజు తన కుమారసంభవమందలి "గూఢవస్తు మయకావ్యములో" "విక్రమ శక గత వర్షము ౧౧౧౦ యగు జయసంవత్సర చైత్రశుద్ధ తదియ మంగళవారము" నాటికి సరియైన 15–3–1054 తేది నాటికి తన కుమారసంభవరచనాకాలమును ప్రతిష్ఠించియున్నాడని చెప్పకతప్పదు.

కాబట్టి ఆంధ్రకుమారసంభవ కావ్యకర్త నన్నిచోడదేవ కవిరాజును, రాజరాజనరేంద్రుని నందంపూడి శాసనకావ్యకర్త నన్నియభట్టును క్రీ. శ. 11–వ శతాబ్దమందలి (1053) సమకాలిక కవులని నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఆంధ్రకుమారసంభవ "సత్కథాధిపతి భవ్యుడు జంగమమల్లికార్జునయో(గి)" "శ్రీనగోత్తుంగ (శ్రీశైలోత్తుంగ) మణిశ్రీసంగత మల్లికార్జునదేవతాకంబై జగంబులం బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమమల్లికార్జునదేవుం" డైనాడని "సత్కవి భువి నన్నెచోడుడు" తను దివ్యకథలో చెప్పియున్నాడు. కాబట్టి ఆంధ్రకుమారసంభవ కావ్యకర్త నన్నిచోడదేవ కవిరాజును, సత్కథాధిపతి (కృతిపతి) జంగమమల్లికార్జునయోగియును పాకనాటిదేశనివాసులని నిస్సందేహముగా చెప్పకతప్పదు.

ఇక "ఒరయూరి కధిపతి" నని

[మిగతా ౪౮-వ పేజీలో.

## అందులోనూ నూత్న ప్రేమికులకు ఇందులో గంభీరార్థంవుండితీరుతుంది!

# రిక్షా ఎక్కిన సిగ్గు

[ చిన్న కథ ]

" స్వామిబుజంమీద చెయ్యిమోపుతూ సరోజ రిక్షా ఎక్కింది. అంతేకాదు లక్ష్మణస్వామికి తన కుడిచేతిని అందిచ్చి రిక్షా ఎక్కేటప్పుడు సాయంచేసింది."

రచయిత:

తోలేటి గంగాధరము, ఎం.యే.

పిండి ఆరపోసి నరీతిగా వుండే వెన్నెలలేదు- ముగ్ధమోహనమైన సంగీతంలేదు- చల్లగాలివీచే సముద్రతీరవిహారంలేదు - పూవుల వాసన గుబాళించే తోట లేదు- కృతజ్ఞతాపూర్వకమైన మాటలులేవు - అంగాంగసంస్పర్శ లేదు- భావోన్మాదం లేదు.

ఈ పరికరాలు ఏమీ లేకుండానే సరోజకు ప్రేమపుట్టింది. ఆ ప్రేమ ఆమెకు హఠాత్తుగా, అనుకోకుండా విద్యుద్వేగంతోవచ్చింది.

మొదటిచూపులోనే మన్మథోద్రేకం. సరోజకు లక్ష్మణస్వామికి కలిగిన అనుభవం అది.

సరోజ మెడికల్ కాలేజీలో చేరిననాడే ఈప్రేమప్రభావం ఆమెకు కలిగింది. ఆమె అంతవరకు సిగ్గరి. మెడికల్ కాలేజీనుంచి బయటపడే సరికి ఆమె లేడీడాక్టరు అవుతుంది. దేవుడు అన్నివిధాలా తిన్నగా చూస్తే అది ఐదేళ్ళనాటిమాట!

ఆమె కాలేజీని సమీపించింది. మంద మంద గమనంతో తనక్లాసు రూములోనికి వెళ్ళింది. అచ్చటికి ఆవరకే లక్ష్మణస్వామి వచ్చివున్నాడు. ఆగదిలో అతడు తప్ప ఇంక ఎవరూలేరు. అప్పుడు ఆ సిగ్గరికత్తె వదనంమీద విభ్రాంతి విహ్వాలించింది. బిత్తరపుచూపుతో ఆమెగది అంతా పరికించింది.

లక్ష్మణస్వామి విశాలవిశేష నేత్రాలు ఆమె చంచలేక్షణాల్ని పరకాయించాయి. ఆమె మనస్సు భావశూన్యమైంది. అయినా ఆమె మనోఫలకంమీద ఆతని వ్యాయామనుస్నిగ్ధమైన ఆజానుబాహు విగ్రహం ముద్రితమైంది.

తోడనే ఆమె శరీరం అంతటా ఒక విద్యుత్కిరణం ప్రసరించింది. ఫలితంగా ఆమెముఖం ఒక్కసారిగా వెల్లబోయింది. ఆవెల్లదనాన్ని కప్పిపుచ్చడానికి ఆమె ఒకసారి తల వాల్చింది. మరిఒకసారి తలపైకి ఎత్తింది. ఎర్రని పెదవులమీద మొలకనవ్వు ఉద్గారితం చేస్తూ ఆమె వెనుదిరిగి చటాలున వెళ్ళిపోయింది.

వెళ్ళిపోతూవుండగా ఆమెకు జ్ఞాపకంవచ్చింది. ఇంటిదగ్గరనుంచి చాలా పెందరాలే బయలుదేరాననీ - మార్గ మధ్యంలో బజారులో ఫవుంటెన్ పేనా కొనుక్కుందా మనుకున్నాననీ- అసంగతి మరిచిపోయి సేరుగా కాలేజీకివచ్చేశాననీ ఆమె జ్ఞాపకం చేసుకుంది. మతిమాలి ఆమె కాలేజీకి ఒకగంట ముందుగా వచ్చింది.

అయితే క్లాసురూములో ఆ పురుషవ్యక్తి ఎవ్వడు? ధవళ ధవళాలైన ఖద్దరు దుస్తులు కట్టిన ఆ యువకుడు తన సహాధ్యాయుల్లో ఒకడా? తనకు మల్లేనే మతిమాలి అతడుకూడా చాలా పెందరాళే కాలేజీకి వచ్చాడా?

ఆమె తిరిగి వీధిలోకి వచ్చింది. కాని ఇంతలోనే ఆమె ప్రేమతో ఆర్ద్రమైపోయింది.ఆసంగతి ఇంకా ఆమెకు పూర్తిగా తెలియక పోవచ్చును. మొదటిచూపులో ప్రేమ! కాని ఆమె అది అట్టిదిగా అనుకో లేదు. ప్రేమ అల్లే తనప్రభావాన్ని ప్రసరిస్తుంది కాబోలు!

ఒక విద్యుత్కిరణం ఆమెలో ఆయువకుణ్ణి చూచినప్పుడు ప్రసరించినమాట నిజమే. కాని అది అంతలో ప్రేమగా పరిణామం పొందుతుందా!

౨

అతడు ఆమె సహాధ్యాయుడే. ఒకరికి ఒకరికి పరిచయమైంది. కాని అతన్ని కళ్లెత్తి చూచినప్పుడల్లా, అతనితో పళ్లెత్తి పలికినప్పుడల్లా ఆమెకు అదోవిధమైన ఇట్టిది అట్టిది అని చెప్పరాని వికారభావం కలిగేది. మనస్సులో ఏదో చెయ్యవేసి కలచినట్లు అయ్యేది— కొంత కాలానికి ఆమెకు అర్థమైంది అతడు తన హృదయాన్ని చూరగొన్నాడని–

అతన్ని మరిచిపోదామని ఆమె అనుకున్నది. కాని సాధ్యం కాలేదు. అతని చూపుల్లో ఏదో సమ్మోహనాస్త్రం వుంది.

కాబట్టి పరిచయమైన రెండు మాసాలకే వారి హృదయాలు ప్రణయార్ద్రాలు అయాయి. లక్ష్మణస్వామి తన ప్రేమను అనేకవిధాల ఆమెకు తెలియచేసే సూచనలు చేస్తూ వచ్చాడు.

సరోజమాత్రం సిగ్గరికత్తె. ఆమెకు అవి అస్తమానూ అర్థమయ్యేవి కావు. ఆసంగతి లక్ష్మణస్వామికి మరింతబాధను కలిగించేది.

3

సాధారణంగా కాలేజీకి లక్ష్మణస్వామి, సరోజ ముందుగా వచ్చేవారు. ఒక్కొక్కప్పుడు అతను ముందు. ఒక్కొక్కప్పుడు ఆమె ముందు.

ఒకనాటి ఉదయాన్ని లక్ష్మణస్వామి ముందు వచ్చాడు. తన డ్రాయరులో పుస్తకాలు పెట్టుకుని ఒక సిగరెట్టేనా కాల్చుకువద్దామని బయటికి వెళ్లాడు. తిరిగి వచ్చి అతడు తన హృదయానికి నిర్భరమైన ఆనందాన్ని ఇచ్చిన ఒక సంఘటన చూశాడు.

అప్పుడే సరోజవచ్చి వుంది. ఆ గదిలో ఇంక ఎవరూలేరు. నిశిత దృష్టులతో ఆమె గదిఅంతా పరకాయించింది.

లక్ష్మణస్వామి డ్రాయరువద్దకు వెళ్ళింది. నెమ్మదిగా దానిని తెరిచింది.

అతని పుస్తకాలు ఆమెకు స్వాగతమిచ్చాయి. తోడనే ఆమె ముఖంమీద మధురమందహాసం పొడసూపింది. తనకంటె ముందే అతడు వచ్చాడన్నమాట! అతని పుస్తకాల్లో ఒకదానిని ఆమె ఎత్తిపైకితీసి తన వక్షస్థలానికి అద్దుకుంది. అద్దుకుని దానిని యథాస్థలంలో పెట్టివేసింది.

సిగరెట్టు తాగి వస్తూవస్తూ లక్ష్మణస్వామి చూసిన ఆత్మకింపైనదృశ్యం ఇది.

తోడనే అతనికి వొక విధమైన ఉదుటు వచ్చింది. వెంటనే వెళ్ళి ఆమెను కౌగలించుకుని తన ప్రేమను వెల్లడించాలని అనుకున్నాడు.

కాని అతణ్ణిచూడ్డంతోటే ఆమె పొందిన బిత్తరితనాన్ని కనిపెట్టి అతడు తన సాహసకృత్యాన్ని మాని వేశాడు.

చెప్పడానికి, వినడానికి విషయం సాధారణమైందిగానే కనిపిస్తుంది. కాని ప్రేమికులకు అందులోనూ నూత్నప్రేమికులకు ఇందులో గంభీరార్థం వుండితీరుతుంది!

ఇట్టి సంఘటనలు ఇంకా ఎన్నో జరిగాయి. సరోజ తనపట్ల విశేష ప్రేమ చూపుతూవున్నదని లక్ష్మణస్వామికి అవగతమైంది. అయినా అనేకమైన అనుమానాలు అతని వెన్నంటి వేపించుకు తింటూ వుండేవి. ఏదో ఒకసారి ముఖాముఖిని ఆమెను అడిగివేద్దామని అతనికి వుండేది.

కాని ఆమె అమితమైన సిగ్గరికత్తె. అతన్ని చూచీచూడ్డంలో ఆమె బిత్తరపోయేది. ఆమె బిత్తరిపాటుచూచి అతడు తెల్లబోయి నోట మాటలేకుండా వుండిపోయేవాడు.

౪

ఇట్లా వుంటూవుండగా ఒకనాడు ఒక చక్కని సంఘటన జరిగింది.

ఆ దేతరగతిలో విలియమ్ అనే యువకుడు, మేరీ అనే యువతి— ఆంగ్లోఇండియన్‌లు— చదువుతూ వుండేవారు. వారు ఇద్దరూ ప్రేమికులు. ఆసంగతి ఆకాలేజీలో అంద

[మిగతా ౪౮-వ పేజీలో.

# రిజాఖాన్ పహ్లవి

## (పెర్షియానియంత)

"రారాజైనా హంసతూలికాతల్పాలు ఒల్లన గట్టి బల్లమీద రెండు తివాసీలు పరుచుకొని గుర్రపుజీను తలకింద పెట్టుకునిపడుకుంటాడు"

నియంతలను ప్రేమించుటే అరుదు. కాని సర్వప్రపంచముచేత ఆదరింపబడే నియంత ఒక్కడున్నాడు. అతడే పెరిష్యాదేశపు షా. నియంతల మరణానంతరము వారిస్థానములను ఆక్రమింపగల తగిన నాయకుడు దొరకకపోవుట ఒక లోపము. కాని పెరిష్యాదేశపు ప్రజలు అనగా నేటి 'యిరాన్' దేశీయులు అట్టి భయమునుపొంద నవసరములేదు. ఎందుచేతనంటే వారికి నేటి యువరాజుపై ఎక్కువ అభిమానము ఆదరముకలదు. యువరాజు అనగా షా యొక్క పెద్ద కుమారుడే.

రజియాపహ్లవి తొమ్మండుగురు సంతానములో యువరాజు ప్రథముడు. అతడు యీమధ్యనే ఈజిప్టురాజు సోదరిని వివాహమాడినాడు. అతడు తన పాలనాశక్తిచే తండ్రిని మరపింపగలడని ప్రజల అభిప్రాయము. ఈయువరాజు పేరు మహమద్ రిజాషఫూర్ రాకుమారుడు. అతని వయస్సు పందొమ్మిది వత్సరములు. అతడు తండ్రి ఉత్సాహమును శరీరబలమును సంతరించుకొన్నాడు. ఆటలలో అగ్రగణ్యుడు. ప్రత్యేకముగా టెన్నిస్సు సంఘు. కాలిబంతి ఆటయందు గుఱ్ఱపుస్వారియందు, వేటయందు ప్రసిద్ధపురుషుడు. ఆతడు స్విడ్జర్‌లాండునందువున్న ఐదు సంవత్సరములు బాలభటసంఘాభివృద్ధిలో తీవ్రముగా పనిచేసి యిరాన్ బాలభటసంస్థను అభివృద్ధిలోనికి తెచ్చినాడు.

పెరిష్యాలోని నెమలి సింహాసనమును అధిష్టించి రజాపహ్లవి దాని పూర్వగౌరవము పునరుద్ధరించినాడు. అ సింహాసనము ముందు తను ఒకానొకదినము పరిచారికుడుగా నున్నాడు. ఆసింహాసనమును రిజాఖాన్ పహ్లవి తదనంతరము అలంకరింపబోవు మహమద్ విచిత్రమైన అనుభవము కలవాడై వున్నాడు.

రిజాఖాన్ పహ్లవి అహమ్మదుషా యొక్క కోసాక్ సేనాదళములో ఒక సైనికుడుగా ప్రవేశించాడు. అది ముప్పదిఅయిదు సంవత్సరములకు పూర్వపుముచ్చట. ఆదినము అతని జీవితములో అపూర్వమైనదని చెప్పవచ్చు.

దేశములోని అరాచకమును అవగాహన చేసుకొన్నవాడై షా యొక్క దుష్ప్రవర్తన అరికట్టుటకుగాను 1921 లో కొంతమంది అనుచరులతో అతడు టెహరాన్ నగరముపై దాడివెడలినాడు. ఆనాడు అతనిదృష్టికి తిండిలేక మలమలమాడుచున్న ప్రజలే గోచరించారు. దేశము దుర్భిక్షమైవుండ షా పారిస్సునగరమున స్త్రీలోలుడై వున్నాడు. ప్రజాహృదయరంజకుడైన రిజాకు ఆస్థితి కంటగింపుగా వున్నది- షా పారిస్సునగరమందలి ఉద్యానవనంలో మదమత్తుడై తిరుగుచుండ ప్రభుత్వము అంతూదరీలేని అప్పులపాలై పోసాగింది.

పరదేశమునకు పోవు ధనప్రవాహమును అరికట్ట సంకల్పించుకున్నాడు రజాఖాన్. పెరిష్యాముఖ్యపట్టణమైన టెహరాన్ చేచిక్కగానే ప్రభుత్వశకటమును ఆధునిక పద్ధతులమీద నడచునట్లు చేశాడు. ప్రభుత్వమును ఆధునికమార్గములలో నడిపే విషయమున రిజాఖాన్‌కు అటాటర్కు కెమాల్‌పాషా

ఒజ్జబంతి అయినాడు.

1925–వ సంవత్సరమునాటికి అతని ఆశయములు చాలవరకు సఫలీకృతము లైనవి. కాని దానితో అతడు సంతృప్తి పొందలేదు.

మహమ్మదు షా పారిస్సులో కాపురంవల్ల పెరిష్యాప్రజల అనాదరణకు పాత్రుడైనాడు. వారి వంశమునందు ప్రజలకు పూర్వమున్న గౌరవము యీ అహమ్మదుషా ప్రవర్తనవల్ల అంతరించిపోయింది. ప్రఖ్యాతవీరుడైన అలెగ్జాండరు అధిష్ఠించిన సింహాసనము నేడు విషయలోలుడై రాత్రింబవళ్లు స్త్రీలతో నాట్యగాండ్రి, అంతులేని త్రాగుడులో మునిగి తేలే షావల్ల అపవిత్రమైనదని ఆ ప్రజలు పరితపించారు. తప్ప త్రాగి సారాగ్లాసుకూడా పట్టుకోలేక తనచొక్కా తడుపుకునే శోచనీయస్థితికి వచ్చాడు షా. కాగా ఆ అవివేకపు రాజును రూపుమాపాలని రిజా సంకల్పించుకొన్నాడు. ఫలితంగా తాను షాపదవికి ప్రజలచే ఎన్నుకోబడ్డట్టు, అహమ్మదుషాను రాజభ్రష్టుని చేసినట్టు ప్రకటించాడు.

పాదుషాలు తమ పిచ్చి చేష్టలకు ప్రఖ్యాతిగాంచారు. ఆలాంటి వారిలో పిచ్చి తుగలక్ ఒకడు. రిజాఖాన్ పల్లవి మహమ్మదీయుడైనా పిచ్చిచేష్టలు ఏమీచేయలేదు. మహమ్మదీయస్త్రీలు ఘోషాకి ప్రఖ్యాతివహించారు. కాని రిజాఖాన్ సింహాసనారూఢుడైన దినమున స్త్రీలుకూడా ఆవుత్సవమందు అత్యుత్సాహముతో బహిరంగముగా పాల్గొన్నారు.

రిజాఖాన్ నెపోలియన్‌లాగ తనే స్వయముగా కిరీటమును ధరించాడు. అతనికి కిరీటంపెట్టి ఆశీర్వదింపవచ్చిన మతగురువుని పొమ్మని చెప్పినాడుట!

నేడు యిరాన్ దేశములో నూతన జ్యోతి వెలుగొందింది. ప్రజ

లలో అపూర్వమైన చైతన్యం కలిగింది. ఆ దేశముయొక్క వైశాల్యం 628000 మైళ్లు. అందలి జనాభా 10000000. ఈ నూతన శోభకు ఆద్యబ్రహ్మ మన రజాఖాన్ పహ్లవే.

గౌరవములోను, రూపరేఖా విలాసములందును అతడు యిరాన్ దేశమును పరిపాలించిన పూర్వ పురుషులను పోలియున్నాడు. రూపమునకు తగిన బలసంపదను తన దేశ చరిత్రనుండి సంగ్రహించినాడు.

రజాఖాన్ ప్రభుత్వమందలి ప్రతి విషయమును స్వయముగా చూచుకుంటాడు. అతడు నిరంతర ప్రయాణాలు చేస్తూ వుంటాడు.

ఇరాన్ పార్లమెంటు సభ్యులు ప్రజలచే ఎన్నుకోబడినవారే. షా రిని సంప్రదింపకుండా అతడు ఏవిషయమును తన యభిప్రాయమును వెలిబుచ్చడు. కాని ఆసభ్యులు అతనిచే నియమింపబడిన వారికన్న నమ్రులై అతని కనుసన్నల మెలంగుదురు. అతని అభిప్రాయము దేశ సౌభాగ్యమునకే దారితీయునని ప్రజల పరిపూర్ణ విశ్వాసము. ఆ మంత్రులందరు షా అనుమతిలేనిదే ఏమి చేయుటకు అధికారములేదు. వారిని తొలగించుటకూడా షా చేతిలోని పనే.

ఎవరుకాని షాకు వ్యతిరేకముగా ప్రవర్తించుటకే వెరచెదరు, అట్లు వ్యతిరేకముగా నడచినచో శిక్ష తీవ్రమైనదే, ప్రజలకు అతని యందు నిరుపమానమైన అభిమానము. కావున అతనిమాట సుగ్రీవాజ్ఞగా తలదాలుస్తారు. పదిసంవత్సరములలో అతడు 12500 మైళ్ళ రోడ్లు వేయించి ప్రజలకు ప్రయాణ సౌకర్యమును కలిగించాడు.

అప్పుచేయకుండా ఆదాయములో కూడబెట్టి ట్రాన్సు జార్డాన్ రైలుమార్గమును నిర్మించాడు. షా యొక్క పరిపాలన అతితీవ్రముగా నున్నను ధర్మవిరుద్ధమనజాలము.

ఇరువది సంవత్సరములకు పూర్వం యిరాన్ దేశమును ఆవరించియున్న దారిద్ర్యము రిజాఖు వెరచి దేశమును వీడిపోయింది. ఇరన్ దేశాన్నుండి దరిద్రమును పారదోలిన ధైర్యశాలి షా రిజాఖాన్ పల్లవి.

బలవద్వీర్యసంపదగల రాజు కాని క్రూరుడు కాడు. సామాన్య కుటుంబమునందు జన్మించినా గొప్పవిగ్రహము. అతనిని సైనికులు పూజిస్తారు. యువకులు తండ్రిగా భావిస్తారు. అతనికి అంతులేని అధికారమున్నను నిగర్వచూడామణి. అతడు శ్రమపడి పనిచేస్తాడు. అతని అలవాట్లు చాలా మితమైనవి.

అరువదిఏళ్ళు దాటినా అతనిలో చలాకీ తగ్గలేదు. దినమునకు పదిహేనుగంటలు పని చేస్తాడు. అతడు దినమునకు నాలుగుగంటల కాలముమాత్రమే నిద్రపోతాడు. పెర్షియా రారాజైనా అతనికి నిద్రించుటకు హంసతూలికలు అవసరంలేదు. గట్టి బల్లమీద రెండు తివాసీలు పరచుకొని గుడ్డపుజీను తలక్రింద పెట్టుకుని పడుకుంటాడు. ఉదయం ఆరుగంటలకల్లా లేస్తాడు దినమునకు ఒకసారే భుజిస్తాడు. తాగుడు దరికి చేరనీయడు. అంత శరీరానికి ఆ వొక భోజనము సరిపోవునో చాలదో కదా! రాజమందిరములోనుండే టెహరాన్ నగరములోని యితర జాతీయులనందరిని చూడగలడు. ప్రస్తుతపు యిరాన్ యువకులలో జాతీయత అద్వితీయముగా వున్నది కాని యితర దేశములయెడ ఎట్టి అసహ్యతను ప్రదర్శించరు. ఆముఖ్యపట్టణములో అన్నిజాతులవారుఉన్నారు. అందులో స్కాండ్‌నేవియన్ ఫ్రెంచి, హంగేరియన్, యిటలీ, జర్మనీ, జెక్ రష్యాజాతివారు యింగ్లీషువారుకూడా ఉన్నారు. పెరిష్యా విమానదళమునందు యింగ్లీషువారు తయారుచేసినవే అధికంగా వున్నాయి.

పూర్వపు పాదుషాలకన్న యితని హయాములో రాజమందిరమున శాంతి అధికముగా వున్నదని చెప్పవచ్చు.

గతమును మరిచిపోకుండా షా తన కుటుంబమునకు తన బాల్యస్థితిని అప్పటప్పట జ్ఞాపకం చేస్తూ వుంటాడు. సామాన్య కుటుంబీకులు చదువుకునే పాఠశాలయందే తన ముగ్గురు కుమార్తెలను చదివించాడు. ఆ నిరాడంబరతను యితర ధనికులుకూడా అనుసరించారు. యథారాజా తథాప్రజ అన్నారు కదా!

తమశక్తిసంపదచేతను, శీలముచేతను ఖ్యాతివహించిన సామాన్య కుటుంబీకులనే భర్తగా బడయుడని అతడు తన కుమార్తెలకు బోధించాడు.

పెరిష్యాదేశపు క్రామవెల్ అనబడు రిజాఖాను ప్రపంచములోని తొమ్మండుగురు ధనికులలో వొకడుగా చెప్పబడ్డాడు. కాని కొద్దికాలంలోనే ఆధనమంతా యిరాన్ నేషనల్ బేంకునకు యిచ్చివేసాడు. ఆదానగుణం దేశక్షేమకరమని ఆ దేశమందలి పత్రికలు పొగడాయి. అందుతో అతడు ఇతరులకు మార్గదర్శకుడుగా వెలుగొందాడు.

నియంత అయినా తన నిరంతరకార్యదీక్షవల్ల ప్రజల ఆదరాభిమానమునే గాక ప్రపంచ గౌరవంకూడా పొందాడు షా రిజాఖాన్ పల్లవి.

# మణిమాల

## స్వీడన్ : భూలోకస్వర్గం.

సంజప్రొద్దున నాల్గుగంటలకే మూసివేసే ఫాక్టరీలు, సముద్రతీరాన పాఠశాలలు, ఆకాశానికి అంటివుండే ఎత్తైన డాబాలపై కాఫీహోటళ్లు, యుద్ధపువార్తలే ముఖ్యవిషయంగా తెల్పే వార్తాపత్రికలు, ప్రతివ్యక్తీ అరసంచిరూపాయిలు దాచుకొను బ్యాంకులు, దేశఋణాన్నికూడ తీర్చివేయగల బ్యాంకులు, ఖాతాదారులనుండి లాభాన్నికోరని దుకాణములు గలిగి ఎన్నడూ ఖూనీలును లేని దేశము చూచుటకు ఏమానవునకు ఉత్సాహముండదు ? —

అట్టిదేశం ఒకటి ఐరోపాలో వాయవ్యమూలగా బ్రిటిష్‌దీవులకు చేరువలో వుంది. అదే స్వీడను. ఈదేశంలో టూసేజ్ పన్నులు వసూలుచేసి ముసలివారి పోషణకై ఉపయోగిస్తారు. ఆదేశపురాజధానిలోవున్న టౌనుహాలు విచిత్ర శిలావిగ్రహాలచేత, చిత్రపటములచేత నిండి చూడ్డానికి రమ్యంగా వుంటుంది. ఐరోపాఖండంలోని ఇతరదేశాలన్నీ ప్రపంచయుద్ధానికి తయారవుతూవుంటే స్వీడన్ తనశిల్పులను, చిత్రకారులను వృద్ధిపొందించుకొంటూవుంది.

ఇతరదేశపు విశ్రాంతి పఠనాలయాలలాగ సన్యాసుల, బైరాగుల చిత్రపటాలతోగాక స్వీడన్ విశ్రాంతి పఠనాలయాలు శిల్పుల, చిత్రకారుల, యితర పనివాండ్ర శిలావిగ్రహాలతోను, చిత్రపటములతోను నిండివుంటాయి. గత 20 వత్సరములనుండి స్వీడను- సోవియటుకు సోషలిజంలోనూ, బ్రిటనుకు నిరంకుశత్వములోనూ, జర్మనీకి నేషనల్ సోషలిజంలోనూ మార్గదర్శకమవుతూవుంది.

వివాహం చేసికోవడానికి అవసరమైనచో ప్రభుత్వము 50 పౌనులవరకు బదులు ఇస్తుంది.

స్వీడన్‌లోని ఇండస్ట్రీ వ్యాపారం చాలావరకు కో-ఆపరేటివ్ ఫక్కీలో నడుస్తూవుంది. 60 లక్షల జనాభా మాత్రమే కలిగిన ఈచిన్నదేశం చాలా విరివిగా వర్తకం చేస్తున్నది. రాజకీయములు వ్యాపారవిషయములుకూడ కో-ఆపరేటివ్ స్కీముమీదనే నడపబడుచున్నాయి. స్వీడన్‌లో కో ఆపరేటివ్ సొసైటీవలన సేవింగ్సుబ్యాంకులు, ఫాక్టరీలు, దుకాణములు దిగుమతీ వ్యాపారములు, నూనిమిల్లులు, పిండిమరలు, బేకరీలు నడుపబడుతున్నాయి గతవత్సరం ఆసొసైటీలలో మూడవవంతు జనము మెంబర్లుగా చేరివుండిరి. మెంబర్లు కాకపోయినను ఇతరులు కో ఆపరేటివ్ దుకాణములలో మెంబర్లవలెనే వ్యాపారము చేసికోవచ్చును. మెంబర్లకుండు సౌకర్యములే వీరును పొందగలుగుతారు.

స్వీడన్‌లోని స్టాక్‌హోములో పి. యు. బి అను దుకాణమువుంది. అచ్చటనే ఒకానొకప్పుడు గ్రీటా గార్బో (సుప్రసిద్ధ సినీమానటి) టోపీలను అమ్మివుండెను. కొంతకాలమునకు ఆదుకాణపు యజమాని చనిపోయాడు. వానికుమారులు దానిని కో ఆపరేటివ్‌కు విక్రయించారు. అప్పటినుంచి పి. యు. బి వృద్ధి పొందింది.

పసిపిల్లల తల్లులు పనిలోనికి పోవునపుడు తమ పిల్లలను చూచుటకు మంచి దాదులుగల శరణాలయమువద్ద విడుస్తారు. ఆవిధముగా పగలు పిల్లల్ని చూడ్డానికి 7 పెన్నీలు పుచ్చుకుంటారు.

ఆదేశంలో బట్టలను శుభ్రపరచు యంత్రాలు విరివిగావున్నాయి. ఇంగ్లండు దేశముకన్న యిచ్చట కూలి మూడువంతులు హెచ్చుగావుంటుంది. కాని జీవితపుఖర్చు తక్కువ. ఇచ్చట ధనికులు దేశసౌఖ్యమునే చూతురుగాని లోభులై వుండరు. అధనికులు ఎంతనిరంకుశత్వము వహించినను అబద్ధమాడుటకు వెనుకంజ వేయుదురు.

ఏడేండ్ల వయస్సువచ్చినతోడనే ఆ దేశంలో బాలబాలికలను దేశీయవిద్యలో ప్రవేశపెడతారు. అచ్చటవుండే ఎలిమెంటరీ పాఠశాలనుండి విశ్వవిద్యాలయము వరకు ప్రతి పాఠశాలలోను విద్యను ఉచితముగా నేర్పుతారు.

ఈదేశమున ఒక్కడైనా ముష్టిఎత్తుకోనవలసిందిలేదు. ఒక్కొక్క సాధారణ కుటుంబము ఒక్కొక్క మనిషిని పోషిస్తుంది. ఆదేశీయులు దహన సంస్కారమునకు అనవసరమైన ఆడంబరపు ఖర్చులుచేయక ఆసొమ్మును బీదల పోషణకై వినియోగిస్తారు.

దేశసౌభాగ్యానికి కారణభూతము

లైన పనులను చేయుటానికి మాత్రమే దేశీయఋణములను చేయుదురు. హెచ్చు ఋణము రైలుమార్గములు వేయుటకు, విద్యుచ్ఛక్తి పెట్టుటకు మొదలగు పనుల కుపయోగిస్తారు. ఆదేశంలో అతి స్వల్ప ఖర్చుతో మాత్రమే ప్రయాణము చేయుటకు వీలుగావుంటుంది. వేలాది జనము వేసవికాలమున పట్టణాల్ని వదలి పల్లెటి ప్రాంతాలకు పోతారు. అచ్చట జీవితాన్ని క్లుప్తంగా గడుపుకుంటారు.

ఆదేశంలో వస్త్రపుఫ్యాక్టరీలు, బిస్కత్తు ఫ్యాక్టరీలు చూడ్డానికి ప్రోత్సాహకరంగా వుంటాయి.

ఈవిధంగా స్వీడను వర్తక వ్యాపారంలో— పనివానితనంలో— ఇంకా పలువిషయాల్లో ప్రపంచానికి దారిచూపుతూవుంది.

* * *

## పాండవుల పంచ

పాలకొండ తాలూకా వీరఘట్టమునకు సుమారు 8 మైళ్ళదూరమున పాండవుల కొండగలదు. దీని లోభాగమును గుర్తించుటకు వీలులేని రహస్యమగు గుహాయొకటి వున్నది. దీనినే పాండవులపంచ అని వ్యవహరింతురు. ఈ గుహాయందే పురాణప్రసిద్ధులగు పాండవులు అరణ్యవాసము చేసినట్లును, అనాది సిద్ధముగా ఇప్పటికిని చెప్పుకొనుచున్నారు. ఈ గుహాయందు పాండవుల విగ్రహములు కలవు. దీని ప్రాశస్త్యమును గుర్తించి గవర్నమెంటువారు కొలదిధనమును వెచ్చించి తలుపు ద్వారబంధములు మున్నగునవి నిర్మించిరి. ఈ బిలము 1. వంటశాల, 2. విగ్రహముల స్థానము 3. ఖాళీతోకూడిన భాగములుకలది. గుహాదక్షిణదిశకు 4 ఫర్లాంగుల దూరమున కోనేట్ల మెట్టు అను పేరుగల చిన్నకొండయు, అందుపై శివాలయము, ఎదురుగా నూయియు కలిగియున్నది. పూర్వము ఈ ఆలయమునందు మహాశివరాత్రి దినమున గొప్ప ఉత్సవము జరుగుచుండినట్లును యాత్రవాసులలో నొకరు మెట్టపైనుండి పడి చనిపోయినట్లును అప్పటినుండి యాత్రసాగనట్లును తెలియుచున్నది. కోవిలశిథిలమై లింగాకారము మాత్రము మిగిలియున్నది. దానికి అనతిదూరమున మెట్టపై 3 గజములు పొడవు వెడల్పుగల విశాలమగు గోయివున్నది. దీనినే నూయి అని చెప్పుచుందురు. ఉత్తరదిశకు 4 ఫర్లాంగులదూరమున సంజీవిమెట్ట అనెడు పేరుగల కొండయు దానిచెంగట పెద్ద చెరువుకలిగి నేటివరకు సస్యముల కాధారమగుచున్నది. అతి సమీపమున అరణ్యముగలదు. దానిని చిట్టడవియందురు. ఇప్పటికిని ప్రతిముఖ్య పండుగులందు చుట్టుప్రక్కల గ్రామవాసులు అతిభక్తి శ్రద్ధలతో దైవములగు పాండవుల నారాధించుటకొరకు వచ్చుచుండుటచే ఆదినములందు చిన్న చిన్న యాత్రలవలెనే కన్పట్టుచుండును. పాండవుల దర్శనార్థమై పుణ్యస్థలమగు యీపంచకు పలుతావులనుండి వచ్చుచేబోవుచు పవిత్రవంతులగుచుందురు. ఈ స్థలమునందు సుమారు 50 సంవత్సరముల క్రిందట దృఢకాయులై విశేషమైన జడలతోకూడిన వృద్ధదంపతులు వారి జీవితకాలమునంతయు ఈగుహాయందు వాసముచేసి సంయమనములతో నుండిరట. చుట్టుప్రక్కల 3, 4 మైళ్ళదూరమున జననివాసములేని వారిరక్షణ నిమిత్తము పెద్దపులులుకూడ వారి సమక్షమున నుండినవనియు, ప్రజలకు ఎట్టిహానియు చేయుచుండినవని కొందరియు వారిసంరక్షణ నిమిత్తము పెద్దపెద్ద ఆవులుకూడ వుండినవనియు ఆవృద్ధ దంపతులతో ఆ కుటుంబము అంతమొందినదనియు ఇప్పటికిని ప్రజలు చరిత్రలుగా అనేకరీతులు చెప్పుకొనుచున్నారు. యీ గుహను సుమారు 20 సంవత్సరములనుండి కనిపెట్టుకొనియున్న గురుదాసు అనుసాధువు ప్రజాదరమున ధూపదీపనైవేద్యములు నిత్యము ఆరాధన మొనర్చుచు రేయింబవళ్ళు అచ్చటనే వాసము గావించుచు చుట్టుపక్క గ్రామవాస్తవ్యులవద్దనుండి కొంతధనము సేకరించి దిగువనుండి పంచవరకు మెట్లు కట్టించి కృతార్థులైరి.

—సందేశము.

* * *

## సుభాసుచంద్రుని జాత్యభిమానం

ఇది సుబాస్ చంద్రబోసుయొక్క విద్యార్థిదశయందలి వంగజాతికి కీర్తిప్రతిష్టలు తెచ్చిన ఒకఘటన.

ఒరిస్సారాష్ట్రంలోని కటక్ లో 'యూరోపియన్ స్కూలు' అని ఒక స్కూలు వుంది. అందులో చదువుకునే వారు ముఖ్యాతికమూడువంతులు అంతా యూరోపియనులే అందుకనే ఆస్కూలుకు ఆపేరు పెట్టారు. మిగిలినవారంతా యూరోపియనేతరులయినా కోటీశ్వరుల, లక్షలకధికారుల బిడ్డలేగాని అన్యులకు అందుస్థానం లేదు. ఆస్కూలులోనే నేటి నవభారతయువక శిరోమణి, త్యాగమూర్తి సుభాస్ చంద్రుడు తనసోదరునితోకూడా ప్రారంభకవిద్యార్థిదశ గడిపాడు. అప్పటికి అతని వయస్సు 14, 15 సం॥ల కన్న ఎక్కువ వుండదు ఆనాటి అతని యౌవనోద్రేకమందలి ఒక ఘటన అతని జాత్యభిమానాన్ని వెల్లడి

చేశింది.

ఆస్కూలుకు సంబంధించి ఒకవిశాల మైన మైదానంవుంది. అది విద్యార్థుల ఆటస్థలము. రకరకాల ఆటలు అంతా తలోమూల ఆడుకుంటూ వుంటారు.

యథాప్రకారముగా స్కూలు విడిచి పెట్టిన తర్వాత అంతా ఆడుకుంటున్నారు. బోసుసోదరులుకూడా ఒకమూల ఏదోఆట ఆడుకుంటున్నారు. ఇంతలో మరొకమూలనుంచి ఒకభారతక్రైస్తవుడు తనప్రక్క ఒకబెంగాలీ నొకనిని ఉద్దేశించి తన వేరొకస్నేహితునితో 'యీబెంగాలీజాతివుందే చెడ్డలుచ్ఛాకోరు జాతోయి. వీళ్ళని చూస్తేనాకు చెడ్డ వళ్ళుమండుతుంది' అన్నాడు. అదేమాటను అందుకుని వేరొక యూరోపియను యువకుడుకూడా 'నిజమేనోయి! నాకు వాళ్ళనిచూస్తే నాల్గుతన్నాలని బుద్ధి పుట్టుతుంది. దగ్గరవుండడానికి కూడా అసహ్య' మన్నాడు, పాప మాబెంగాలీ యువకునికి నిజానికి చాలా పౌరుషంమాత్రం వచ్చింది. కాని అతని పిరికితనం అతని సర్వాంగాల్ని కట్టేసింది. యీమాటలు ప్రక్కని ఆడుకుంటూన్న సుబాస్‌ని చెవులబడి అతనిశరీరం నిలువున భగ్గుమని పోయినట్టయింది. ఆవేశాన్ని పట్టలేకపోయాడు. తొందరగా వాళ్లున్న చోటికి పరుగెత్తుకొచ్చాడు. వాళ్ళకెదురుగుండా వెళ్ళి గంభీరంగా 'నేను బెంగాలీనే. ఏమిటిసంగతి? ఏంకావాలి చెప్పండి?'అని గద్దించి అడిగాడు. వాళ్ళిద్దరిగుండెలు బేజారైపోయి ఒకరిముఖం ఒకరిచూచుకోవడమే గాని సాహసించి నోరువిప్పి మాట్లాడలేకపోయారు. బోసు తిరిగి అదేప్రకారం రోషంతో అడిగాడు. వాళ్లు ఇతన్ని చూచి జడిసి ప్రక్క గుమ్మంలోనుంచి నెమ్మదిగా దారితీయడం మొదలెట్టారు. అది చూచాడు బోసు. వాళ్ళిద్దరిని పట్టుకుని అందులో క్రైస్తవునితోటి 'లుచ్ఛాకోరులా? యిప్పుడు చూడు వాళ్ళసంగతి' అని చెప్పి సాచి పళ్లు క్రిందవూడిపడేటట్టు ఒక ప్రహారం యిచ్చాడు దవడమీద. తిరిగి ఆంగ్లేయుణ్ణి 'ఏం? బెంగాలీల్ని చూస్తే తన్నబుద్ధివేస్తుందా. ఇపుడు మాడు వాళ్ళపస హూ' అని హుంకరించి తనకాలుతో అతని కాలుత్రొక్కి అణిచిపెట్టి పీక పట్టుకుని క్రిందకు ఒక్క త్రోపుతోశాడు. దానితో అతడు క్రిందబోర్లాపడి మూతిపళ్లు విరక్కొట్టుకున్నాడు. ఇదంతా చూస్తూన్న మిగతా యూరోపియన్ విద్యార్థులంతా 'సిగ్గు సిగ్గు' అని కేకలు వేయడం మొదలెట్టారు.

విజయపూరిత మందహాసంతో సుబాసు ఆమొదటి బెంగాలీ వీపు మృదువుగా తట్టి అతనిని తీసుకొని వెళ్ళిపోయాడు.

విద్యుద్వేగంలో ఈవార్త స్కూల్లోకి పాకిపోయింది. మరునాడు హెడ్‌మాష్టరు, పిన్సిపాలు, మిగతా వుపాధ్యాయులకి అందరికి తెలిసిపోయింది ఈ వార్త. అసలే బోసు క్లాసులో మంచి చురుకైన వాడని, తెలివితేటలైనవాడని స్కూల్లో ప్రసిద్ధి. దానికితోడు అతని జాత్యభిమాన సంఘటన దాన్ని ఇతోధికంచేసింది. అప్పటినుంచి బెంగాలీలంటే హాస్యభావం పోయి అమితమైన భయం, గౌరవంకలిగింది స్కూలు అధికారులకు. నాటి అతని జాత్యభిమాన సంఘటనఫలితంగా నేడు అతడు బెంగాలురాష్ట్రాని కంతటికి ఏకైకనాయకుడయాడు.

—శ్రీ మ జీ వి.

# విజ్ఞాన విషయాలు

హెచ్. జి. వెల్సు వ్రాసిన 'అవుట్లయిన్స్ ఆఫ్ హిస్టరీ' అనే పుస్తకం ఇంతవరకు ఇరవైలక్షల కాపీలు అమ్ముడుపోయింది.

... ... ...

గ్రంథరచనవల్ల హెచ్. జి. వెల్సు 2,00,000 పౌనులకంటే ఎక్కువే ఆర్జించాడు.

... ... ...

యూరపియన్‌లు మద్రాసు నగరంలో 3,000 మంది-కొలంబోలో 3,000 మంది- బొంబాయిలో 5,000 మంది- కలకత్తాలో 15,000 మంది వున్నారు.

... ... ...

హిందూదేశంలో ఏడాదికి 640,00,00,000 గాలన్‌లపాలు ఉత్పత్తి అవుతున్నాయి. అమెరికాసంయుక్తరాష్ట్రాల్లో 1050,00,00,000 గాలన్‌ల పాలు ఏడాదికి ఉత్పత్తి అవుతున్నాయి. పాలు ఉత్పత్తికి మిగిలిన దేశాలన్నీ ఈ రెండు దేశాల తరువాతనే.

... ... ...

మందగమనానికి గజగమనం ఒక నిదర్శనంగా చెబుతారు. కాని అడవిలో ఏనుగు గంటకు ఇరవైనాలుగున్నరమైళ్ళ వంతున నడిచిన నిదర్శనాలుకూడా వున్నాయి.

... ... ...

ప్రపంచంలోని జనాభా ఏడాదికి 3,00,00,000 (మూడుకోట్లు) వంతున అభివృద్ధి పొందుతూవుంది.

... ... ...

కన్నాల్ని పిల్లి తన మీసాలతో కొలుస్తుంది. కన్నుదగ్గర పిల్లి మూతి పెడుతుంది. దాని మీసాల చివర్లకు ఆ కన్నపు అంచులు ఏమాత్రం తగిలినా ఆ కన్నంగుండా తన శరీరం దూరదని పిల్లి నిశ్చయించుకుంటుంది.

... ... ...

ఏనుగుదంతం ఏభై మొదలు నూటఇరవై పౌనుల తూకంవుంటుంది. ఆదంతం ఖరీదు పౌను ఒక్కంటికి పదిహేను రూపాయిలు వుంటుంది.

... ... ...

మానవుని మెదడు కుడిచేతివాటం కలవారిలో ఎడమవైపున పెద్దదిగా వుంటుంది; ఎడమచేతివాటం కలవారిలో కుడివైపున పెద్దదిగా వుంటుంది.

... ... ...

మంచి ముత్యమేదో, చేతముత్యమేదో కళ్ళతో కనుక్కోలేకపోతే నాలికతో కనుక్కోవచ్చు. మంచిముత్యం నాలికమీద పెట్టుకొన్నా చల్లగానే వుండిపోతుంది. చేతముత్యం అట్లాకాక నాలిక వేడిని అందుకుని క్రమంగా వేడియెక్కుతుంది.

... ... ...

రత్నాల్ని, వజ్రాల్ని తూచేతాసులు అతిసున్నితంగా వుంటాయి. ఒకచిప్పలో చిన్ని వెంట్రుక వేసినా ముల్లు వంగుతుంది.

... ... ...

లిఖితరూపకమైన చీనాభాష చీనా అంతా ఒకమాదిరిగానే వుంటుంది. కాని దాని ఉచ్చారణమాత్రం ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్కమాదిరి.

... ... ...

ఆఫ్రికాలోని కేబ్రాలో వెన్న పియానే చెట్టునుండి తయారుచేస్తారు. ఈ వెన్న ఆవువెన్నకంటెకూడా మంచి వాసనవేస్తుందని చెబుతారు.

... ... ...

ఒకరోజుకి సామాన్య మానవుడు సగటున 35 పౌనులగాలి పీల్చి, 4 పౌనుల ఆహారంతిని, 3పౌనుల నీరు తాగుతాడు.

... ... ...

ఈగరెక్క ఒకసెకండులో మూడు వందల ముప్ఫయిసారులు కదులుతుంది.

... ... ...

ఇంగ్లండులోని థ్రష్‌అనేపిట్ట విరామంలేకుండా పదహారుగంటలసేపు పాడగలదు.

... ... ...

నిద్రపోతూవుండగాకూడా పాము చూడగలదు. రెప్పలులేని దానికళ్లు కదిలే వస్తువుల్ని చూస్తాయి.

... ... ...

భూమిమీదకంటె నీటిమీద గాలి వడిగా వీస్తుంది. ఏమంటే భూమిమీద గాలికి కొంతఅడ్డు వుంటుంది.

... ... ...

యుద్ధపరికరాలు కూర్చుకునే పనుల్లో ఏడాదికి ప్రపంచం మొత్తంమీద మూడు వందలకోట్ల పౌనులు వెచ్చిస్తూవుంది.

... ... ...

తేలిక నలుపురంగుగల వెంట్రుకలకంటె గాఢమైన నలుపురంగుగల వెంట్రుకలు ఎక్కువ బలంగా వుంటాయి. అట్టి తలవెంట్రుక ఒక్కటే నాలుగు ఔన్సుల బరువుని మోస్తుంది.

... ... ...

ప్రపంచంలో ఏడుకోట్ల ఏభైలక్షల గుర్రాలు వున్నాయి. అందులో ఒకకోటి అరవైలక్షలు రష్యాలోనూ, ఒకకోటి పదిలక్షలలు అమెరికాసంయుక్త రాష్ట్రాల్లోనూ వున్నాయి.

# వైవాహిక ప్రణయం

## (౧౨-వ పేజీ తరువాయి)

లేకపోవడంచేతనే అనేకుల వైవాహికజీవనాలు ప్రభ్రష్టమైపోతున్నాయి.

❧

ప్రేమికులు - స్త్రీపురుషులు - సాధారణంగా కామవిషయంలో సమానస్థాయీ కలవారై వుండరు. దంపతులలో తరుచు భార్యకంటె భర్తకు కామవాంఛ తీవ్రతరమై వుంటుంది. భర్తయొక్క అజ్ఞానంచేతకాని, బలాత్కారంచేతకాని భార్య కామవాంఛా విముఖురాలు కావచ్చును. జంతువుల్లోవలెనే మానవుల్లోకూడా పురుషుడు స్త్రీని ఆకర్షించి, లాలించి, బుజ్జగించి, మోహింపచేసి, మరులు కొల్పించడం చాలాముఖ్యం.

వైవాహిక జీవనంలో సంభోగధర్మం ఏకరీతిగానుండి విసుగు పుట్టించేదిగా మారడానికి అవకాశంవుంది. దానిని అట్లు మారనీయకూడదు. దాని అంతరార్థాన్ని అది నిలుపుకోవాలి. అన్ని ఇంద్రియాలు- ముఖ్యంగా సౌందర్యోపాసనాబుద్ధి ఆకృత్యంలో మేళవింపును పొందాలి.

మనస్సుద్వారా, తత్వంద్వారా సంభోగకృత్యంయొక్క అంతరార్థాన్ని ఉత్పథానికి కొనిపోవడంచేతనే మానవుడు జంతువులనుండి వేరవుతూవున్నాడు. కామోద్రేకంచేత ప్రస్ఫుటమయ్యే లక్షణాలమీాద ప్రేమఅనేది తనముద్రను గాఢంగావుంచాలి.

మనస్సును, ఇతర ఇంద్రియాలను ఉద్రేకపరచి శృంగారలలితంగా చేయడానికి అనేకమైన విధానాలు అమరివున్నాయి. వలచి వలపించడానికి అవసరమైన చిన్నచిన్నకళా విషయాలన్నీ ఆచరణలోకి తీసుకురావాలి. సంభోగకృత్యం తప్పనిసరి అయినదికదా-అదివరకు అనుకున్నదేకదా · అనేభావాన్ని దంపతుల్లో ఉభయులూకూడా వదిలివేయాలి. కామప్రేమకు అంతులేనన్నిరకాల బాహ్యరూపాల్ని ప్రదర్శింపవచ్చును.

❧

చిన్నచిన్న విషయాలే కామప్రేమను, సంభోగవాంఛను రేకెత్తిస్తాయి. ప్రియమైనపలుకులు, కొద్ది పొగడ్తను వెలార్చేమాటలు మామూలు నిత్యకృత్యాల్లో- కా

మవిషయాలకు సంబంధంలేని మామూలు నిత్యకృత్యాల్లో— మేళవింపును పొందిస్తూవుండాలి. మిగతా అన్ని సమయాల్లోనూ ఆమెను విస్మరించే, విమర్శించే పురుషుని ప్రేమదృష్టుల్ని సంభోగసమయంలో స్త్రీ ఎట్లా స్వీకరింపగలదు? వలచి వలపించే యజ్ఞంలో ముద్దులు, బుజ్జగింపులు ఎంతవాంఛనీయాలో ప్రియమైనమాటలుకూడా అంతే వాంఛనీయాలున్నూ అయివున్నాయి.

❦

స్త్రీలలో కామోద్రేకం చాలా నెమ్మదిగా కలుగుతుంది. సంభోగకృత్యానికి ఆమెను నెమ్మదిగా తయారుచేయాలి. సర్వసాధారణంగా ఆకామవాంఛ ఉద్రేకస్థితిలోకి రావడానికి పూర్వమే పురుషుడికి కామతృప్తి అయిపోవడం జరుగుతూవుంటుంది. అందుచేత ఆమె అతృప్తురాలై వుంటుంది — ఆసందర్భంలో ఆమెకు చీదరకూడా కలుగుతుంది. ఇంతేకాక ఆస్థితివల్ల ఆమె నరాలు ఏమాత్రమూ సవ్యంగా సౌమ్యస్థితిని అందవు.

'సంభోగకృత్యంలో భార్యనూడా పూర్తిగా పాల్గొనేటట్లు చేయడానికి భర్త ఆత్మసంయమశక్తిని అలవరుచుకొని కొత్త విజ్ఞానాన్ని ప్రదర్శించాలి. ప్రేమికులుగా పురుషులపట్ల స్త్రీలు ఇప్పటికంటె ఉన్నతమైన విజ్ఞానాన్ని కోరే కల్పంలో మానవజాతి భవిష్యత్తు ప్రకాశమానమౌతుంది.

❦

పిల్లలకు సరియైన వాతావరణాన్ని కలిగించేదిగా వివాహంవుండాలి, పిల్లల నెమ్మది అయిన పెంపకం— అంగికంగా, తాత్వికంగా వారిపెరుగదల— ఇవి జరగాలంటే దంపతుల వైవాహికజీవితం శాశ్వతమైనదై, నడుమ భంగాలులేనిదిగా వుండాలి. అనగా ఏకపత్నీత్వమూ — ఏకభర్తృత్వమూగల విడాకులులేని వివాహం ఆచారమై వుండాలి.

పిల్లల గుణగతాదులు వంశపరంపరానచ్చే తల్లిదండ్రుల శిక్షణమీద చాలవరకు ఆధారపడి వుం

టుంది. కాబట్టి స్త్రీ తనకు భర్తను, పురుషుడు తనకు భార్యను కూర్చుకునే విషయంలో అత్యంతమైన మెలుకువను చూపాలి.

భార్యాభర్తలనడుమ మానసిక, వైజ్ఞానిక ఐక్యత మిక్కిలి వరణీయమైనది. స్త్రీల తెలివితేటలు పురుషుల తెలివితేటలకు విభిన్నమైనవి. అయినను అవి వీనికి ఎంతమాత్రమున్నూ లొచ్చుఅయినవి కావు. బాలురకు ఇచ్చేటంతటి వైజ్ఞానికవిద్యనే బాలికలకుకూడా ప్రసాదించడం అవసరం. బాల బాలికలు జీవితంలో వాళ్ళకు ఉద్దిష్టమైన భాగాన్ని ప్రశంసనీయంగా నిర్వహించడానికి వారికి విపులమైన విజ్ఞానం కావలసివుంటుంది. బాలికలకు ఒక్క గృహవిద్యమాత్రమే నేర్పి వారి విజ్ఞానాన్ని సంకుచితపరచడం సముచితవిషయంకాదు.

విద్యయొక్క, వికాసంయొక్క సహకారాన్ని పొందకపోయినట్లు అయితే ప్రేమ సారస్యంలేనిది, నీరసమైనది అవుతుంది. కామప్రేమకు విద్యావికాసాలు తోడుపడ్డం మీదనే వైవాహికజీవితంయొక్క సౌఖ్యసౌభాగ్యాలు, సంఘవ్యవస్థయొక్క భవితవ్యమూ ఆధారపడివున్నాయి.

నేటివిద్య ప్రతి ఒక బాలుని హృదయంలోనూ ప్రతి ఒక బాలిక హృదయంలోనూ మొక్కవోని స్వార్థపరత్వాన్ని పెంచుతూవుంది. సహజంగా బాలబాలికల హృదయాల్లో వుండే స్వార్థపరత్వాన్ని తగ్గించడానికి బదులు ఈ విద్య దానిని మరింత పెంపొందిస్తూవుంది. ప్రేమకు ఈ స్వార్థపరత్వం ప్రబలమైనశత్రువు.

గర్భనిరోధకసాధనాల ప్రయోగవిస్తృతితో సంభోగకృత్యం యొక్క సహజఫలితాలు మూలవిచ్ఛేదమై పోతున్నాయి. అయినా సంతానోత్పాదనన్యాయం విధాయకమై నిలిచేవుంటుంది. దానిని తప్పి నడిచినవారు ఏదో విధంగా సునిశితంగా శిక్షకు పాత్రులవుతూనే వుంటారు.

మనం ఊహించినట్లు, భావించినట్లు మనం జీవింపగలుగుదుమనే తలపుతో వుండడం అపాయాలతో కూడిన తప్పిదం. మనం ప్రకృతిలో భాగాలము. కాగా ప్రకృతియొక్క కఠిననియమాలకు మనం లోను గాక తప్పదు.

పిల్లలులేని వైవాహిక జీవితం వెన్నులేని సస్యంలాగున పాడువారివుంటుంది; స్వార్థపరమైన తప్పిదంగా జాలువారుతుంది. పిల్లలులేని దంపతుల వృద్ధాప్యం సాధారణంగా ఎడారిప్రదేశాన్ని పోలి వుంటుంది.

ఒక్కసంతానంతో తృప్తిపడి వుండడంకూడా కొంచెం యించుమించు అట్టిదే. ఏమంటే దంపతు

## 'ఆంధ్రతాయశము నాది'

ఆంధ్రకవిత్వకళామరవాణియై
తిక్కన్న మురళి నదించినాడు
ఆంధ్రసంగీత విహంగమై త్యాగరా
జమృతగీతములు వెలార్చినాడు
ఆంధ్రశిల్పస్వప్నమది యజంతాగుహా
హృదయగోళమున రూపించుకొనియె
ఆంధ్రప్రతాపగర్జారావఘోషలు
బొబ్బిలికథల మార్మోగిపోయె
"ఆంధ్రుడను నేను, ఆంధ్రతాయశము నాది,
ఆంధ్రదేశాన నే జన్మమైతి" యనుచు
గళరవమునెత్తి, హృదయతంత్రులు చలింప,
చాటుకొనవోయి! దశదిశల్ చాటుకొనుము !

—కస్తూరి రాజామాణిక్యం, బి.ఏ.

లకు ఒకటే ఒకపిల్ల వుండాలి అనుకోండి. ఆపిల్లకు పిల్లలసహవాసం దుర్లభమౌతుంది- అన్నలు, అప్పలు, తమ్ముళ్లు, చెల్లెలు ఇచ్చే అనుభవాలకు వారు నోచనివారు అవుతారు. పెద్ద కుటుంబాల్లో అనగా పిల్లా, మేకా పదిమందిగల కుటుంబాల్లో చిన్నకుటుంబాల్లో కంటె సహకారబుద్ధి, సుఖమయభావము విస్తరించి వుంటుంది.

జాతి పరంపరగా నిలిచివుండడానికి, కుటుంబం సుఖమయస్థితిలో తరలిస్తూవుండటానికి ప్రతికుటుంబానికి కనీసం ముగ్గురు పిల్లలేనా వుండడం అవసరం.

❦

సంఘవ్యవస్థ సవ్యంగా సాగడానికి కావలసింది ప్రత్యేకవ్యక్తి కాదు- కలసిపనిచేసే భార్య, భర్త, సంతానమూ. కాని విచిత్రమేమిటంటే- ప్రజాస్వామికం కుటుంబానికి కంటె ప్రత్యేకవ్యక్తులకు ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తుంది.

ప్రేమ విలాసవస్తువు కాదని, అది అత్యవసరవస్తువు అనీ మనం ఇంకా పూర్తిగా అవగాహనచేసుకోలేదు. భర్తను, భార్యను, సంతానాన్ని ఒకటిగాకూర్చి కట్టడానికి సమర్థమైన ఓషధి ప్రేమ ఒక్కటే. యజమానిని, కార్మికుని- బలహీనుణ్ణి, బలవంతుణ్ణి - ధనవంతుని, దరిద్రుని ఒకజాతిగా కూర్చడానికి శక్తిగల సిమెంటు అది ఒక్కటే.

మానవునకు ప్రేమ లేకపోయినట్లయితే దానిని ఇతర స్థలాల్లో మనం చూపలేము బుద్ధి, జఠరరసము, మొదలైనవి ఎంత అవసరమో ప్రేమకూడా మానవునకు అంత అవసరము. ప్రేమచేత ఉత్తరంగితము కాకపోతే మానవుల్లో ఏసంబంధమున్నా తృప్తిని ఇచ్చేదిగా వుండదు. 'ఒకరిని ఒకరు ప్రేమించుకోండి' అనే నీతివాక్యం ప్రకృతిన్యాయం కాని అన్యం కాదు.

❦

వ్యాపారంలో, కళలో, శాస్త్రంలో అతిలోకఖ్యాతిని ఆర్జించేవారు అందరూ తీవ్రకామవాంఛాపరిపూర్ణులు. జాతీయనాయకులలో —విజేతలలో—వీరులలో సంభోగవాంఛావిముఖులు ఒక్కరుకూడా వుండివుండలేదు. అయితే ఒక సంగతి. ఉత్తమమైన ప్రేమ శారీరక సంభోగాన్ని కోరకపోవచ్చును. సంభోగవాంఛా నిరోధమువలన ఒక్కొక్కప్పుడు భవ్యావేశం ప్రభవించవచ్చును.

❦

ఏతావతా తేలింది ఏమిటంటే- వైవాహిక జీవితంకోరే శారీరక, మానసిక, సాంఘిక అవసరాల విషయంలో స్త్రీపురుషులకు సహజ విజ్ఞానం ఏమీ లేదనీ—ఈ క్లిష్టసంబంధంయొక్క తొలగింపరాని న్యాయసూత్రాల్ని నేర్చుకునే శక్తి వారికి వుందనీ.

భార్యాధర్మాన్ని, భర్తధర్మాన్ని పొందబోయే స్త్రీపురుషులు వైవాహికసాహసకృత్యానికి అనువైన పరికరాల్ని సమకూర్చుకోవడం అవసరం. ఇదివరకే వైవాహికజీవితంలో తగిలివుండి ఆశాభంగం పొందినవారు ఆశాభంగం కలగకుండా చేసుకోవడానికి అవకాశంవుందనీ, ఇప్పటికీకూడా జయాన్ని పొందవచ్చుననీ తెలుసుకోవాలి.

❦

భౌతికప్రపంచంలో మానవునికి ఆధిపత్యాన్ని ఇచ్చిన అతని బుద్ధిబలానికి ప్రేమప్రపంచలో కూడా అతనికి ఆధిపత్యం ఇచ్చే సమర్థత వుంది.




## రేచీకటి జబ్బుకలవారికి నారింజపండు మంచిది.

మిరుమిట్లుగొలిపే మోటారుదీపాల కాంతివల్ల- వీధులదీపాల కాంతి మార్పువల్ల మోటార్లునడిపేవారిలో చాలామందికి వుండే తాత్కాలికపు రేచీకటిజబ్బువారు రోజుకి ఒక్కొక్క నారింజపండు తింటూవస్తే తగ్గిపోతుంది.

ఎడింబరోలోని రాయల్ ఇన్‌ఫర్మరీలో బహువారాలు పరిశోధనచేసి స్కాటిష్ శాస్త్రవేత్త డాక్టర్ సి. పి. స్టూవార్టు తేల్చిన శాస్త్రాంశం ఇది.

పన్నెండుమాసాలక్రితం ప్రభుత్వం వారు మోటారులవలని రోడ్డు ప్రమాదాలు- నడిపేవారి రేచీకటిమూలంగా కలిగే వాటిని తగ్గించేసాధనం కనిపెట్టే పరిశోధకులకు ధనసహాయం ఇస్తామని ప్రకటించారు.

ఆసందర్భంలో డాక్టర్ స్టూవార్టు పరిశోధనలు సాగించాడు. మోటారు నడిపేవారి రేచీకటిజబ్బు కుదర్చడానికి విటమినులు అవసరమని అతను అభిప్రాయపడ్డాడు.

రాయల్ ఇన్‌ఫర్మరీలో ఒక చిన్న గదిని పరిశోధకమందిరంగా మార్చాడు.

అతనికి ఈపరిశోధనలో సహాయభూతులుగా వుండడానికి అంగీకరించిన లేబరేటరీ మిత్రులను కొన్ని నిమిషాలు దీపపుకాంతి మిరుమిట్లను లోనుచేశాడు.

రాత్రి చూపు తక్కువగావున్నట్లు కనిపించిన వారిని, అంతలో తమదృష్టిని కోల్పోనేవారిని ప్రత్యేకమైన ఆహారనియమంలో వుంచాడు.

రోజుకి ఒకటి రెండు నారింజపళ్లు తింటూవున్నవారికి ఆపళ్ళలోని విటమినుల ప్రభావంచేత రాత్రిళ్లుకూడా మామూలు దృష్టి నిలబడివుండేది.

—*Sunday Standard.*

## ఆహారంలో లోహం అత్యవసరం.

మన ఆహారపదార్థాల్లో అతిముఖ్యమైనవాటిలో ఇనుము ఒకటి. శరీరంలోని ప్రతిభాగానికి ఇనుము కావలని వుంది. రక్తానికి ఎర్రరంగు ఇచ్చేపదార్థానికి లోహం అత్యవసరం. ఈపదార్థమే లోని అంగాలికి, కండరాలికి, నరాలకి ప్రాణవాయువుని కొనిపోయి అక్కడినుంచి దుష్టపదార్థాన్ని- బొగ్గుపులుసుగాలి- నిబయటికి పంపివేస్తుంది. యీపని చేయడానికి మనశరీరాలికి కొంత ఇనుము కావలసివుంది. మన తూకాన్నిపట్టిచూస్తే మనకు కావలసిన ఇనుము కొద్దకే.

పోషకవిషయంలో లోహం అత్యవసరమైంది కాబట్టి మనంతినే ఆహారపదార్థాల్లో ఇనుముసరఫరా జాగ్రత్తగా జరిగేటట్లు చూసుకోవాలి. ఇతరులకు కంటె పిల్లలకు, గర్భవతులకు కొంచెం ఎక్కువ ఇనుము కావలసివుంటుంది.

మనం తిను ఆహారాల్లో చాలా వాటిల్లో ఇనుము కావలసినంతపాళ్ళలోలేదు. కావుననే మనలో చాలామంది బద్ధకంగా, పాలిపోయి, తగుమైన ఆకలిలేకవుంటారు.

యీస్థితి తొలగిపోవాలంటే ఇనుము బాగావుండే ఆహారపదార్థాలని మనం విశేషంగా ఉపయోగించాలి. పచ్చిఆకుకూరలలో, గ్రుడ్లలో, పొట్టుతోకూడిన పప్పుదినుసులలో ఇనుము బాగా విస్తరించి వుంటుంది.

మంచి పోషకపదార్థంగా మనంనమ్మే పాలల్లో ఇతరమైన పోషకపదార్థాలు మంచి పాళ్ళలో వున్నాయి కాని ఇనుముమాత్రంలేదు.

—*Toronto Star.*

## స్నానాన్నిగురించి తెలుసుకోదగిన కొత్త సంగతులు :

ఇటీవలి వైద్యశాస్త్రపరిశోధనవల్ల స్నానం శరీరంలోనుంచి విలువగల విటమిన్‌లను పోగొట్టుతుందనీ, బలాన్నితగ్గిస్తుందనీ, పుష్టికరమైన ఆహారం తినకుండావుండేవారికి చాలా నష్టాన్ని కలిగించవచ్చుననీ తేలుతూవుంది.

సింసినాటిలోని హైస్కూలు విద్యార్థుల సాయంతో మిస్ యాగ్నిస్ హెల్మర్ అనే ఆమె నాలుగురకాల పరిశో

ధనలు చేసింది.

దేహపరిశ్రమ సాగించి ఆ విద్యార్థులు స్నానంచేసిన నీటిని జాగ్రత్తపెట్టి ఆనీటిని ఆమె పరీక్షచేసింది. ఆనీటినుంచి రసాయనికపరిశోధనవిధానంచేత ఒక విధమైన నూనిపదార్థం గ్రహింపబడింది. ఆపదార్థాన్ని లేబరేటరీలోని ఎలకలకు -డి విటమిన్ లేకపోవడంచేత ఎముకల జబ్బుతో బాధపడుతూవున్న ఎలకలకు-తినిపించారు.

అవి తినడం ప్రారంభించాక అన్ని ఎలకలూ మంచి ఆరోగ్యాన్ని పొందాయి. దీనివల్ల మనం తెలుసుకోవలసింది ఏమిటంటే ఆవిద్యార్థులు స్నానంచేయడంమూలంగా తమ శరీరంలోని డి విటమిన్ పదార్థాన్ని పోగొట్టుకొన్నారని. ఇక్కడి డి విటమిన్ తైలరూపంతో వున్న ముడివస్తువ. అంటే ఏమన్నమాట? ఆవిద్యార్థులు వారి ఎముకలకు బలం కూర్చే పదార్థాన్ని స్నానంచేసేటప్పుడు ఆ పోగొట్టుకుంటున్నారనే కదా?

మంచి ఆరోగ్యంలో వున్నవారి విషయంలో యీపోగొట్టుకోవడం అంత పరిగణనీయ విషయం కాకపోవచ్చు. కాని ఆరోగ్యం చెడివున్నవారికి, పుష్టికరమైన ఆహారానికి నోచిపుట్టని వారికి యీస్నానంవలని యీనష్టం తోసివేయరానిదిగా వుంటుంది.

పూర్వం రోమన్‌లు తరుచు స్నానాలుచేసే విషయంలో అతిశ్రద్ధగా వుండేవారు. కాని వారుస్నానానంతరం వినియమంగా శరీరానికి నూనిరాసుకునేవారు. ఇట్లా రాసుకోవడంచేత వారు స్నానంవల్ల పోయే తైలరూపకమైన డి విటమిన్ పదార్థాన్ని తిరిగి కొల్పొక్కనేవారన్నమాట.

—*The American Weekly.*

## ఆరోగ్యానికి ఆకుపచ్చరంగు అత్యవసరం.

మానవప్రపంచంలో అతిముఖ్యమైన రంగుల్లో ఆకుపచ్చరంగు అతిప్రధానమైంది. ఆకుపచ్చరంగు లేకపోతే మానవుడు బ్రతకలేడు. ఆకుపచ్చ రంగు లేకపోతే మనకు తినేటందుకు ఏమీ వుండదు. ఏమంటే ఆరంగులేకుండా చెట్లు చేమలు బతకలేవు. చెట్లు చేమలులేనిదే జంతువులు బ్రతకలేవు. యీ ఆకుపచ్చరంగు సూర్యకాంతిసహాయంతో నీటినుంచి, బొగ్గుపులుసుగాలినుంచి మానవుని ఆహారానికి అతిముఖ్యమైన కార్బొహైడ్రేట్సును ఉత్పత్తిచేస్తుంది. ఈ ఉత్పత్తిచేసే విధానంమాత్రం ఇంతవరకు శాస్త్రకారులకు అందలేదు.

—*Australian Digest.*

## మెదడుతో పనిచేసేవారి మెదడుకు అనుకోని విశ్రాంతి.

మెదడుతో మీరు గట్టిగా పనిచేస్తూవుంటూ వుండగా మీ మెదడు చటాలున ఒకనిమిషం పనిచేయడానికి నిరాకరిస్తుందని అనుకోండి. దానిని గురించి మీరు అంతగా ఆలోచించవద్దు.

అది మీ మెదడు చెడిపోయిందనడానికి గుర్తుకాదు. ఆసమయంలో అది విశ్రాంతి తీసుకుంటూ వున్నదన్నమాట.

చికాగో విశ్వవిద్యాలయంలో ఈ విషయంలో పరిశోధనలు సాగించి ప్రొఫెసర్ ఆర్థరు జి. బిల్సు మెదడు ఒక రెప్పపాటుకాలం మొండికివేసే ఈ రోగం అందరికీ వుంటుంది అన్నాడు.

కూలివాడు తన కండరాల్ని ఉపయోగిస్తూ చాలాసేపు పనిజేయగలడు. కాని తుదకు అతనికి అలసటవస్తుంది. అతడు తప్పకుండా విశ్రాంతి తీసుకోవలసివస్తుంది.

ఐనా మెదడుతో పనిచేసేవాడు గంటలకొద్దీ ఎట్టి అలసటకాని లేకుండా పనిచేయకలడు. ఏమంటే—అతని మెదడు పనిలో నడుమనడుమ దానిఅంతట అదే విశ్రాంతి తీసుకుంటూ వుంటుంది.

శరీరంలో నీరసబాధలేని మామూలు మనిషికి నిమిషానికి మూడుమొదలు ఐదు సారులవరకు నిర్బంధంగా విశ్రాంతి కలుగుతూవుంటుంది. ఆ విశ్రాంతి కాలాలు సాధారణంగా ఒకసెకండు- ఒకలిప్తకాలంలో ముగుస్తూవుంటాయి. బాగా అలసిపోయిన మనిషికి ఈ విశ్రాంతికాలం ఒక్కొక్కసారి రెండుమూడు సెకండులకాలంకూడా వుండవచ్చు. ఇట్లా నిమిషానికి ఎనిమిది పది సారులు కూడా అతని మెదడుకు విశ్రాంతికాలాలు వస్తూవుంటాయి.

ఇట్టి సమయాల్లో అతడు ఏసంగతిని గురించికాని ఆలోచించలేడు.

ఈమాదిరిగా మెదడు ఎప్పటికప్పుడే కోడికునుకులు తీస్తూవుంటుంది. ఇట్లా తీయడంవల్ల అది పనిచేసేకాలంలో అరింట ఒకభాగం దాని విశ్రాంతికి పోతూవుంటుంది.

మెదడుతో పనిచేసేవాడు ఒక రోజుకు ఎనిమిదిగంటలు పనిచేశాడు అనుకోండి. ఆ ఎనిమిది గంటలలోనూ అతని మెదడు ఒకగంట, ఇరవైనిమిషాలు అతనికి తెలియకుండానే విశ్రాంతి తీసుకుంటుంది.

—*The Literary Digest*

*

ఆంధ్రమహాభారతంలో తిక్కనార్యుడు భగవద్గీతను ఎందుచేతనో తెనిగింపలేదు, అనంతరమైనా చాలాకాలం వరకు తెనుగుకవులు ఎవరూ దానిని తెనిగిద్దామనే ఉద్దేశాన్ని పొందలేదు.

ఇటీవల దత్తోజీపండితుడు దానిని తెనిగించెను. ఆధునికులలో శ్రీ ఆదిపూడి సోమనాథరావు, శ్రీ తాడూరి లక్ష్మీనరసింహారావు, శ్రీ రావుసాహెబు బచ్చు పాపయ్యశ్రేష్ఠి మున్నగువారు భగవద్గీతను తెనుగున వెలయించి తెనుగువారి కృతజ్ఞతకు పాత్రులైనారు.

అయితే పై తెనిగింపులన్నీ ప్రాయకంగా గీతపద్యాల్లో వున్నాయి. శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి దానిని ఇప్పుడు వృత్తాలలోకి అనువదించి వున్నారు.

గాయకుడు, ఉపాధ్యాయుడు, గ్రంథకర్త, సంపాదకుడు అయి శ్రీకృష్ణమూర్తిశాస్త్రి ఆంధ్రుల్ని యథాశక్తిని సేవించారు. వారి హరికథలు ఆంధ్రదేశమంతా విన్నది. వారి ఉపాధ్యాయ వృత్తిని బరంపురం ఆమకొన్నది. 'త్యాగరాజస్వామి చరిత', 'గృహలక్ష్మి కంఠాభరణము' మున్నగు గ్రంథాలు వారిని గ్రంథకర్తను చేశాయి. వారు కొంతకాలం 'గృహలక్ష్మి' మాసపత్రికను సంపాదించి వుండుట ఆంధ్రలోక మెరిగినవిషయమే. అట్టివారు తామురచియించిన భగవద్గీత ముద్రించుటకు ఆంధ్రలోకపు సాయాన్ని అర్థిస్తూవున్నారు. వారి అనువాదశైలి తెలియడానికి భగవద్గీతలోని భక్తియోగ ఖండం ఇచట ముద్రితము.

—సంపాదకుడు.

# భగవద్గీత - భక్తియోగము

శా॥ దేవా, యాదవవంశవార్ధిసితకాంతీ, శ్రీపతీ, సర్వదా
భావంబందునఁ గొందరర్థిమెయి నిన్ బంధింతు; రవ్యక్తమున్
భావాతీతము నక్షరంబనుచు సంభావింతురో కొందఱు; రిం
దేవా రుత్తమయోగవేదులు కదా? యీ వానతీవే దయన్॥

మ॥ అని సంప్రశ్నముసేయు పార్థునెడఁ దా నత్యాదరంబొప్పఁగా
నను నంతన్ భగవానుఁ డౌనవును ముఖ్యంబైన దీమాటయున్
నను జింతింపుచు శ్రద్ధమీరఁగ సదా నామేటివృత్తంబులన్
విని రక్తుండగు నిత్యయుక్తుడె సుమీ విద్వాంసుఁడౌ వెండియున్॥

మ॥ సములై సంతతసర్వభూతహితులై, సాధించి చంచద్హృషీ
కము, లవ్యక్త మనంత మవ్యయము, నాకాశం బచింత్యంబు స
ర్వము, సర్వత్రగమున్ ధృవం బచల ముద్భాసంబుఁగూటస్థ భా
వమునై యొప్పుచునున్న యక్షరపరబ్రహ్మం బుపాసించు ధీ
రమతుల్ సూటిగ నన్నుఁజేరుదురు వీరశ్రేష్ఠ తథ్యంబుగా॥

శా॥ ఆయుద్యోగము మంచిదే! అయిన నేయాధారమూ లేదు, నో
పాయంబిట్టి యుపాసనాపరత నెవ్వండేన్ సుఖంబొందునే
ఆయాసంబు నపార దుఃఖముల పెంపా పైరసాభాసమే
ఆయాసల్ గల దేహధారులకుఁగా కవ్యంబు సిద్ధించునే॥

శా॥ ఆపేరాసల నేగి యేటఁబడుటేలా హాయిగాఁబ్రేమతో
నాపైఁజిత్తమునిల్పి తత్పరతతో నన్నేయుపాసించి యే
వ్యాపారంబులనైనఁగాని మరి నాకర్పించు నాభక్తియో
గోపాయంబదిగా యనన్య మిదికాదో నీవయోచింపుమా॥

ఉ॥ నాకిఁక భక్తియోగకలనాసముపేతులె యిష్టులౌదు ర
స్తోకమతుల్ యదార్థసుకృతుల్ మరివారలె యట్టివారి నే
వీకొని యీజరామరణభీకరమౌ భవసాగరంబు నే
నేకద యొక్కమారుగఁ దరింపఁగఁ జేయుచు నుందుఁబ్రీతితో॥

కం॥ కావున జూడు మిటులఁదఁ।ద్భావంబున భక్తియోగపరతంత్రుఁడవై
కావింతువేనిఁగార్యము। లీవు భవాబ్ధినిఁదరింతు విదినిజముసుమీ॥

మ॥ అనఘా, నీకొకవేళ నీపని యసాధ్యంబే యగుంగాక సా
ధనచే సాధ్యముకాని దేదని ప్రయత్నంబెంతయేఁజేయు మా
పనికిం జాలని వాడవేయగునెనో పార్థా మదర్థంబులే
యనుకో కర్మలనాచరించునెడ! మోక్షోర్ఘ్నాండ వౌదెట్టులేన్॥

శా॥ పోనిమ్మింతయుఁ జేతఁగానిదెయగుంబో యేయుపాయంబులే
దోనాయర్జున, కోరఁబోకు ఫల ముద్యోగంబునం దెన్నఁడా
జ్ఞానాభ్యాసములందుఁ బెద్దయగు జ్ఞానంబైన నాజ్ఞానమున్
ధ్యానంబొక్కటె మించుదీనికి ఫలత్యాగంబె మీఁదయ్యెడిన్॥

మ॥ అరరే! యెవ్వఁడు, భూతజాతములయం దద్వేషియై సఖ్యమున్
గరుణన్ బాగుగఁ బూని తుల్యసుఖదుఃఖప్రేక్షుఁడై స్థైరణన్
నిరహంకారియు నిర్మముండునయి, నన్నేరూఢిగా నమ్మి సు
స్థిరయోగప్రతిభావిశిష్టుఁడయి బుద్ధిన్ మానసంబున్ సదా
బరమానందమునొందువాఁడు ప్రియుఁడున్ భక్తుండు నాకర్జునా॥

ఉ॥ ఎవ్వనివల్ల లోకమును, ఎవ్వఁడులోకమువల్ల నెన్నఁడే
రవ్వయు రట్టులేక యనురాగము మీర సుఖించుచుందురో
ఎవ్వఁడు హర్షరోషభయహేతువిముక్తుఁడొ వాఁడుగాక యో
కవ్వడి, యెవ్వఁ డింక మరికల్గును నాకు బ్రియుండు, భక్తుఁడున్॥

చం॥ వలపులెపో మనశ్శుచిని బాడొనరించు నటించు దక్షుఁడై
మెలకువదోఁపఁగా దలకు మించినకార్యము లెల్ల మాని పొం
తలఁబడుచున్ మనోవ్యథల దగ్ధుఁడుగాక ప్రియంబు బూని యి
మ్ముల నలరారువాఁడె కడుఁబూజ్యుఁడు నాకుహితుండుభక్తుఁడున్॥

ఉ॥ మేలగువేళ మోదమున మించుట – కీడగువేళ వంతచేఁ
దూలుట, కష్టనష్టమున దుఃఖము – వెండియు లేనిదానికై
గోలయు, నెగ్గులగ్గులకుఁ గ్రుంగుట పొంగుటలెల్ల మాని నా
లో, లయమొందు భక్తిరస లుబ్ధుఁడు నాకు బ్రియుండు పాండవా॥

మ॥ సమచిత్తంబున, శత్రుమిత్రులయెడన్ సర్వత్ర మానావమా
నములన్ గష్టసుఖోష్ణశీతముల శాంతంబొంది నిర్ద్వంద్వుఁడై
సమనిందాస్తుతిబుద్ధిగల్గుముని యేస్వల్పంబుతోనైన మో
దము నొందంగలవాఁ డసంగుఁడు, జగద్ధాముండు, సుస్థైర్యవి
క్రముఁడౌ వాఁడు, మహాత్మకుండు నిజభక్తాగ్రేసరుండౌఁగదా॥

శా॥ విన్నావా యిది భక్తియోగము: సదావేద్యంబు, ధర్మ్యామృతం
బన్నా యెవ్వరు, దీనిసంతతము శ్రద్ధాసక్తులై భక్తితో
నన్నేనమ్మి యుపాసనల్ సలిపి యానందింతురో వారెపో
యెన్నండైన మహాత్ములకుల్ ప్రియము నెంతే గూర్తు నాకన్నిటన్॥

—పసుపర్తి కృష్ణమూర్తిశాస్త్రి

# కలకత్తా టంకసాల

[౯-వ పేజీ తరువాయి]

రూపాయిల్ని చెలామణీకి జారీ చేయవలసివచ్చింది. క్రమంగా ప్రభుత్వమువారి ఆర్థిక సుస్థితి ప్రజలకు తెలిసిపోయింది. కాగా వారు కర్రెన్సీనోట్లకు బదులు రూపాయిలే కావాలనే అభిప్రాయాన్ని వదిలేశారు. ఫలితంగా రూపాయిలు ఎక్కువై పోయాయి. అందుచేత 1924 కు దరిమిలాను కొత్తగా రూపాయిలుఏమీ పోతపోయలేదు.

కావుననే 1924 కు దరిమిలా రూపాయిలు ఏమైనావుంటే అవి దొంగరూపాయిలుగా ఎంచుకోవలసిందని వ్యాసప్రారంభంలో హెచ్చరించివుండడం.

అరిగిపోయిన రూపాయిలు క్రమంగా చెలామణీలోనుంచి తగ్గిపోతున్నాయి.

ఇప్పుడు కొత్తగా ఆరవజార్జి చక్రవర్తి రూపాయిలు పోతపోస్తున్నారు. అవి అచిరకాలంలోనే చలామణీకి వస్తాయి.

ఇక పలకల పావలాల సంగతి. గుండ్రటి పావలాలు, పలకల పావలాలు రెండూ వుండవలసిన అవసరం లేదు. రెండింటిలోనూ గుండ్రని పావలాకానే ఎక్కువగా ప్రజామోదాన్ని పొందింది. కాగా పలకల పావలా క్రమంగా వెనుబాటును పొందుతూ గుండ్రని పావలాకు చోటు ఇస్తూవుంది.

# పెళ్లికి పూర్వం పరీక్ష

[౯-వ పేజీ తరువాయి]

పూటలు మ్రింగుతూ రోజులు గడుపుతున్నాను. వసంతా! ఆశుభదినం ఎప్పుడు వస్తే అప్పుడు నా కష్టాలు గట్టెక్కినట్లు?'

'పిచ్చివాడవోయి, నళినీ! నీవు పిచ్చివాడవు సుమా! ఎంత అమాయకుడవు. నా ప్రేమరాజ్యమున ప్రథమరాజువు నీవే! నిన్ను చూచినవెనుకనే ఆ యువకుని చూచాను. కాని ఏమైనా హృదయం ఆ చంద్రమోహనుపై లగ్నమైంది. అంత మాత్రమున నీవు కలతచెందవలసిన కారణంలేదు. నా స్థానమున నీ ప్రేమకు అర్హురాలైన ఆమెను నీకు సంధానంచేసి మరీ పోదామని వచ్చా' అన్నది వసంత.

'పిచ్చిపిల్లా! నీతో తులతూగగల స్త్రీ నాకు కనుపించడంలేదు. నా దృష్టికి కనుపించేదల్లా మందహాసవదనముతో నుంటే వసంతయే!'

'నళినీ! అంతచేలగా పలుక్కు. పురుషులు...వారుకేవలం మొగమహారాజులు. వారు అనేకవస్తువులను ప్రేమతోవాడి అదిజారిపోతే దానిని యిట్టే మరిచిపోతారు. విను. నీవు నాయందుచూపే ఆదరాభిమానములకు బదులు నేను ఏమి ఉపకారం చేయగలనా అని తెగ ఆలోచిస్తూవున్నాను. భగవంతుడు నా యెడ అనుగ్రహం చూపించాడు. జ్ఞాపకం వుందా క్రిందటి ఆదివారం సాయంసమయమున మనమిద్దరము కలసుకొని బీచీని షికారు చేస్తూ వుండగా నా స్నేహితురాలుఒకామె మనలను పలుకరించింది. స్పృహకురాలేదూ? ఆమెది నాయీడే. పళ్ళనిశరీరం. ఇంపైన అంగసౌష్టవం. బాగాచదువుకుంది. ప్రపంచం అంతా చూచివచ్చింది. సంగీతంకూడా బాగా పాడుతుంది. సినీమాల్లో వేషాలు వేసి పేరుకూడా సంపాదించింది. ఆమె నిన్న రాత్రి మా గదికివచ్చి ఆమె ప్రేమజీవితం అంతా చెప్పుకుంది. ఆమెకు నీ మీద మనస్సువున్నట్టుకూడా వెలిబుచ్చింది.'

'నన్ను ప్రేమించిందా! ఎవరు? ఎవరామె?'

'కంగారుపడకు, నళినీ! కలతచెందవలసినంత అగత్యం ఏమీలేదు. మన యిద్దరి మధ్యవున్న స్నేహభావం ఆమె కనిపెట్టింది. నాకు ఆ మోహనునిమీద వున్న మోజుకూడా గ్రహించింది. మన ఆ న్యోన్యత ఆమెనిర్మల ప్రేమహృదయాన్ని కొంచెంగా కురచపరచింది. అందుచేత ఆమెవచ్చి నన్ను కొన్నిప్రశ్నలడిగింది. వాటికి నే నిచ్చిన సమాధానాలతో తృప్తిపడి ఆనందమయడోలికలలో ఊగులాడింది. అప్పటినుంచి నిన్ను చూడాలని, పెండ్లిచేసుకోవాలని కుతూహలపడుతూవుంది తనను నీవద్దకు తీసుకువెళ్ళమని నన్ను వేడిస్తూ కూడావుంది, నళినీ!'

'ఈ సంభాషణ అంతా నా ప్రేమ తీవ్రతమీద నీరు చల్లేవిగా నేవున్నాయి, వసంతా! నాకు ఇందులో ఆనందం కనుపించడంలేదు. క్షమించు. ఇక ఏవిషయం గూర్చైనా చెప్పుదూ.'

'నీబాధ ఏలావుంటుందో నాకు తెలుసును, నళినీ! కాని నీవు అదిసహించి నాకు సమాధానంచెప్పాలి. మొత్తం మీద ప్రపంచంలో నాకన్న అందమైన వాళ్ళు, చదువుకున్నవాళ్ళు ఎంతమంది యువతులులేరు? మా స్నేహితురాలు ఆ రతీదేవిని మరపిస్తుంది, అందంలో. చూస్తే నీకేతెలుస్తుంది. చెప్పడం మరిచా ఆమె పేరు సరోజ.

'ప్రియమిత్రమా! నీయందు నాకు అభిమానం లేకపోతే యింతగా నేను శ్రమపడవలసిన అవసరంలేదు. నీ సుఖమే నా సుఖం గనుక యింతవరకూ చెబుతున్నా. దురదృష్టవశాన రెండురోజులు ఆలస్యమైంది కాని లేకపోతే ఆ రెండురోజులు ముందు నిన్నేకలుసుకుంటే మనమిద్దరం పెండ్లిచేసుకువుండేవారం కదూ! దానికేంగాని సరోజ సుందరే కాక శీలవతి. విశేషించి వివేకవతి. నీవు శ్లాఘించే ప్రబంధకాలపు స్త్రీని పోలివుంటుంది.'

'వసంతా! నీవు నన్ను పెళ్ళిచేసుకోకుండా నాకు రంభని తీసుకువచ్చికట్టబెట్టినా సుఖంవుండదు. ఎందుకు నన్ను వేధిస్తావు?'

'నళినీ! నావిధి నేను నెరవేర్చాలికదా, నేను నిన్ను వివాహమాడనంతమాత్రంచేత నాకు నీయందుంటే ప్రేమకేవిధమైన భంగంరాదు. నీ యానందమే నాఆనందం. కొబట్టి నిన్ను సుఖపెట్టే బాధ్యత నా తలపైనున్నది. అంచేత నిన్ను సుఖపెడతాను.'

'నీవు చెప్పేదంతా వట్టిబూటకం. రెండురోజులు పోయాయంటే యీ వుత్సాహమంతా నీరు కారిపోతుంది. అయితే ఏ స్త్రీయైనా తాను ప్రేమించిన వాడు యితర స్త్రీతో సుఖిస్తోవుంటే

చూచి సహిస్తాడా? ఈర్ష్యచే మండిపోదూ! అంచేత నీమాటయందు నాకు నమ్మకంలేదు.'

'నీవు ఏమనుకున్నా సరే నేను చెప్పేది పూర్తికానీ.'

'అయితే చెప్పు. నేనిక అడ్డుతగలను.

'సరోజ! నీయందు లగ్నమానస అయివుంది. ఆమెను నీకు పరిచయంచేస్తా. నీవు ఆమెను ప్రేమించడం నేర్చుకొని పెండ్లిచేసుకో.

'నీవు చాలా విచిత్రమైన దానవే! నీళ్ళలో గేదెనుపెట్టి కొమ్ములుచూపి బేరమాడినట్టుంది. ఆ పిల్ల ఎర్రగావుంటుందో నల్లగావుంటుందో తెలియదు. ఎట్లా చేసుకుంటానని చెప్పను.'

'అవసరం లేకపోయినా నీవు ఆమెను చూద్దుగాని, నా మాటనమ్ము. నాకన్న వేయిరెట్లు ముగ్ధమోహనంగా వుంటుంది. సరా! కాని ఒక్కవిషయం చెప్పాలి. నీవు దానికి అడ్డుచెప్పననుకుంటా.

'ఓహో!ఆమెమనవర్ణస్థురాలు కాదా?

'కాకేమి? శుద్ధవైదికకుటుంబంలోనిది. లేకపోతే నీతో యింతదూరం ఎందుకుచెబుతాను. కాని ఆమె బాలవితంతువు సుమా! ఆ పిల్లకి అయిదోఏట వివాహంఅయింది. పెళ్ళిఅయిన పదిరోజులకే పరమపదించాడాముసలితాతయ్య- పెళ్ళికొడుకు.'

'నీవు యింతదూరం చెప్పేది వెధవముండను పెళ్ళిచేసుకోమనా, వసంతా! మనశాస్త్రాలు వప్పుకోవే.'

నళినీ! యింత చదువుకున్నవాడవు నీవే యిట్లుచెప్పడం ఆశ్చర్యంగావుంది. అర్థంలేని ఆ సంఘనియమాన్ని తృణీకరించడానికి నీకుసాహసములేదా. తుప్పుపట్టి చీకిపోయిన పూర్వాచారాలను పట్టుకువ్రేలాడితే ఏమిలాభం? స్వార్థపరులైన మొగవాడువ్రాసినవేనా శాస్త్రములు? మగవానికేగాని స్త్రీకి కామవాంఛవుండదా? ఆడది మనిషికాదా? దానికి మాత్రం సుఖించాలనే యిచ్ఛలుగదా? తొంభైఏండ్ల తొక్కినాసరే భార్యపోతే యింకోభార్యను పొందవచ్చు. కాని, స్త్రీ...పతు పతులాడే యౌవ్వనంలో పొంగిపొరలే ప్రేమజీవితంలో పాడుదేవాలయంలోని విగ్రహంలాగున పడియుండుటఎట్లు చీ! మొగవాడు స్వార్థపరుడు?'

వసంతా! ఎందుకు నామీద అంత ఆగ్రహం. నేనుచేయలేదు ఆశాస్త్రాలా'.

'మీవంటి యువకులు ఎందుకు సాహసంగా ఈ అధర్మమును నిర్మూలింపకూడదు? విధవలను ఎందుకు పుణ్యస్త్రీలనుగా చేయకూడదు? పూర్వం స్త్రీ పశుత్వదశయందున్నప్పుడు ఆ పురుషుని రాజ్యము ఉన్నతపదమందున్నప్పుడు ఈ దౌర్జన్యముసాగింది. కాని నేడు స్త్రీ పురుషునితో సమానంగా విజ్ఞానాభివృద్ధి పొందుచున్నది. అట్టి కాలమందుకూడా బాలవిధవలను సంఘము నిషేధించుట దారుణము కాదా? నీ పశుత్వ కామవాంఛను తీర్చుకొనుటకు ఎందరినైనా పెండ్లి ఆడెదవే? నీవు అంటే నీవుకాదు, నళినీ! ఆవేశంలో అలాఅన్నాను మగవాడన్నమాట. అస్వేచ్ఛ స్త్రీకి ఎందుకుండకూడదంటాను. అభమూ శుభము తెలియని అమాయ స్త్రీకజాతిని బాధించుటేనా మీ మతధర్మములయొక్క ఆశయము.'

౨

ఆవేశముతో మాటాడుటవల్ల ఆమె నేత్రములు ఎర్రబారినవి. ఆమెకు తెలియకుండానే ప్రశస్యముడుచుకొని పిడికిలిగా మారిపోయింది చేయి. ఆమె శక్తిస్వరూపిణిలా కనుపించిందాసమయమున. ఆమె వేడిమాడ్కులకు తాళవేక ఆమె కరపల్లవములను మృదువుగా దువ్వుతూ 'వసంతా! నీకు అట్టి అభిప్రాయంవుంటే నా యభిప్రాయం మార్చుకుంటాను. నీవు హిందూ వివాహములనుగూర్చి యిచ్చిన పుస్తకము చదువుటకు నాకు తీరకకనుపించడంలేదు. దానిని ఎట్లాగో యీరాత్రి తప్పకుండాచదివి నా యభిప్రాయంచెబుతాను. ఆ పెండ్లి చేసుకొనేది లేనిదికూడా చెబుతాను. నీకుసమ్మతమేనా? నాకీ గడువుయిస్తావా, వసంతా!'

'క్షమించు. నళినీ నాకు వళ్ళుతెలియక ఏమేమో కఠినంగామాట్లాడాను. కాని ఏవరైనాసరే హిందూసంఘములోని విధవలనుగూర్చి ఏమాత్రమైనా జాలికలిగివుంటే యీ పాతపురాణాలను తప్పక పెంటకుప్పలకు వప్పగించవలసి వుంటుందని నా అభిప్రాయం. అదీకాక మన శాస్త్రాలలోనే విధవావివాహాలు చేసుకోవచ్చునని కూడావుంది. కాని యీ కొందరు మతగురువులు అట్టి వివాహములను నిషేధించినారు, తమ సర్వాధికారము చెలాయిస్తూ. మొత్తంమీద ఆపిల్లను నీవు వివాహంచేసుకొన్నా చేసుకోకపోయినా నాకంత విచారంలేదు కాని చదువుకున్న నవీనభావయుతుడవైన నీవు నా అభిప్రాయముతో ఏకీభవిస్తావని నాఊహ. నళినీ!'

'కాని నీ వాగ్దానం ప్రకారం రేపసాయంకాలం ఆపిల్లా నేను మా యింటివద్ద వేచివుంటాం. నీవువచ్చి నీ అభిప్రాయం తెలియజేయి. నేను కోరేది.'

'ప్రియా! తప్పకుండా అట్లాగేచేస్తాకాని ఆపిల్లను పెండ్లిచేసుకొనుటకు

యిష్టం లేకపోతే మాత్రంరాను.' అన్నాడు నళిని.

## 3

ఆ మరునాడు వసంత లక్కరంగు పట్టుచీరకట్టి పూదాజాకట్టు తొడిగి తల బాగాదువ్వుకొని మల్లెమొగ్గలు చుక్కగా బర్హాముడిచుట్టూ అర్ధచంద్రాకారంగాకట్టుకుని ఎదురుచూస్తూ తనయింటి వద్దగదిలో పడకకుర్చీమీద జేరగిలబడి కూచుంది. ఆగదికి తూర్పుదిశనవున్న కిటికీగుండా సముద్రపుగాలి రైమనివీస్తూ వుంది. ముంగురులు ఆ చంద్రవదన ముఖముమీద చిందులాడుతున్నాయి. ఈముఖం నా ప్రతిబింబం కాదుకదా యని తొంగిచూస్తూన్నాడు తారామనోహరుడు. ఆకిటికీసందులోనుంచి చంద్రకాంతములు తమ మనోకాంతుడు ప్రకాసిస్తున్నాడు కదాయని మందహాసము చేయుచున్నవాఅన్నట్లు విప్పారినవి. పొగలంతా ఎచ్చటికో తలవకదిక్కునకు పోయి తిరిగివచ్చి తమ గృహిణిని గృహమునుచూచి ఆనందపరవశములై మధురరుతములు చేయుచున్నది శకుంత సంతానములు.

సుమారు ఆరున్నరగంటల సమయం. నవమన్మథాకారునివలె తయారైవచ్చాడు నళిని వసంతగృహానికి. వీధిగుమ్మంవద్ద తట్టిపిలిచాడు. వసంత ఇంత నాటకమూ వానిని పరీక్షించడానికే గనుక చివాలునలేచి లోనికిపోయింది. తల్లిని పిలిచింది. 'అమ్మా! నళిని వచ్చాడు. అతనికి తలుపుతిసి లోనికిరమ్మను. కూచోమనిచెప్పు. నేనీ తలుపువెనుకాల దాగివింటాను,అతనేమంటాడో. సమయం కనిపెట్టివస్తా రంగంలోకి. తెలిసిందా.'

వసంతతల్లి వసుంధరాదేవి మెల్లిగావెళ్లి తలుపుతీసింది. 'నళినీకాంతం గారా? రండి కూచోండి అమ్మాయి బట్టకట్టుకుంటోంది వస్తుంది. 'అవునమ్మా! నాపేరే నళినీకాంతం. అయితే ఆమె స్నేహితురాలెక్కడ.'

'లేదు నాయనా! రాలేదు. మా అమ్మాయి ఎవరికోసమో ఎదురుచూస్తూ నేవుంది. కాని మీ యిద్దరమధ్యజరిగిన సంభాషణఅంతా నిన్నరాత్రే నాతో చెప్పింది మాపిల్ల. మీయొక్క త్యాగశీలమునకు చాలాసంతోషంగా వుంది' అందా ముసలమ్మ.

'వసంత! చాలా తెలివైన పిల్ల. ఆమె భర్త చాలా అదృష్టవంతుడు. నా దురదృష్టంకొద్దీ ఆభాగ్యం నాకు లభించింది కాదు.' అన్నాడు నళిని.

దానికీ అదేబాధ, నాయనా! నీమీద ఏంతో ప్రేమ దానికి. కాని—'

'కాని ఏంలాభం? ఒక కొత్తపిల్లను తీసుకువచ్చి నన్ను పెండ్లిచేసుకోమని బలవంతపెడుతుదామె. ఆమెమాట సుగ్రీవాజ్ఞ. నేను ఎదురుచెప్పలేకపోతున్నా.'

'నళినీ! నీవు చాలాచిత్రమైన వాడవోయి. మగవాళ్ళకు ఏం తెలుస్తుంది చెప్పు ఆడజాతిబాధలు. ఆమె కొంచెం తెలివి తక్కువగా ప్రవర్తించివుంటే ఆమెకు భర్త దొరికేవాడేకాదు.'

'తల్లీ! అతడెవరైనా సరే నాధన్యవాదాలు అర్పిస్తున్నా.'

'ఆ పెళ్ళికొడుకు నీవేఅయితే—'

'నేనా! నిజంగా! నేనా! అంతధన్యుడనే! ఆమె తన అభిప్రాయం మార్చుకుందా? అత్తా! ఎక్కడుందామె వసంతా! వసంతా!' అని ఉద్రేకంతో లేచినుంచున్నాడు.

'ఓ ఆడావిడి పెళ్ళికొడకా! ఆమె అభిప్రాయం మార్చుకోలేదు. రూపం మార్చుకుంది. వసంతా, సరోజా ఒకతే. ఇదిగో యిక్కడేవుంది. 'అమ్మాయి!' అని పిలిచింది.

మందహాసాంచితమైన వదనముతో ఆకురంగనయాన తళుక్కున మెరుపుతీగలా ఆతనియెుందువాలింది. ఆతనిప్రక్కను నిలచి ''క్షమించు నళినీ నిన్ను మోసం చేశాను. విధవావివాహాలయెడ నీకుంటే అలసత్వము వదల్చడానికే నేను యింత పన్నాగం పన్నవలసివచ్చింది. నేనే ఆ సరోజను. సరోజే నేను. నా యీ తప్పిదమును క్షమించు. ఆ మాటలంటూ అతని భుజములమీద చేయివైచింది ఆమె.

నళినీ వసంతలు ఏకమైపోయినారు. వసుంధర నవ్వుతూ ఆ గది విడిచింది.



సారధివారి 'రైతుబిడ్డ'లో రైతుపాత్రధారి 'శ్రీరాఘవ'.

# రిక్షా ఎక్కిన సిగ్గు

[౩౮-వ పేజీ తరువాయి.]

రికీ తెలిసిన విషయమే.

మేరీ తన తలిదండ్రులతో నివశిస్తూవుంది. విలియమ్స్ వారి ఇంట్లోనే వుంటూవున్నాడు.

విలియమ్‌తో లక్ష్మణస్వామి తన ప్రేమసంగతి తెలుపుకున్నాడు. దానిమీాద వారిద్దరూ కలిసి ఒక ఎత్తు ఎత్తారు.

విలియమ్, మేరీలు ఒకనాటి సాయంకాలం లక్ష్మణస్వామిని, సరోజను తమయింటిలో కాఫీకి పిలిచారు. ఆనాడు వారియింట్లో పియానోవాద్యంకూడా ఏర్పాటు చేసారు.

కాలేజీనుంచి నేరుగా అందరూ మేరీయింటికి వెళ్ళడానికి ఏర్పాటు. మొదట సరోజ చాలా సిగ్గుపడింది. రానంటే తనకు గర్వం అనుకుంటారేమో అనే భయం. వెళ్ళడానికి వల్లమాలినసిగ్గు. ఆలోచించి ఆలోచించి ఆమె ఆఖరికి అంగీకరించింది.

అప్పుడు లక్ష్మణస్వామి మనస్సులో పొందిన ఆనందానికి అవధి లేదు. విలియమ్, మేరీలు ఇంటివద్ద మెలిగే తీరుచూచి సరోజ తన లజ్జను వదులుకుంటుందనీ—అక్కడ సంగీతపు జోరుచేత పారవశ్యాన్ని పొందినప్పుడు సరోజకు తన సంగతి చెప్పివేయవచ్చుననీ లక్ష్మణస్వామి ఉవ్విళ్లూరాడు.

వెళ్లేటప్పుడు నలుగురూ కలిసే వెళ్లారు. కాఫీ, ఫలహారాలు; ఆ పిమ్మట సంగీతం—

ఇంతసేపూ సరోజ మౌనంగానే వుంది. సంగీతం తరవాత విలియమ్, మేరీ కలిసి నృత్యంచేశారు. విప్పారినకళ్ళతో, విభ్రాంతిపొందిన మనస్సుతో సరోజ ఆనృత్యాన్ని చూస్తూ కూచుంది.

✻

రాత్రి ఎనిమిది గంటలయింది. ఇక వెళ్ళడానికి వేళ అయిందనే సంగతి లక్ష్మణస్వామికి గుర్తువచ్చింది. తోడనే అతడు లేచి సరోజకు ఆసంగతిచెప్పి విలియమ్, మేరీలవద్ద సెలవుతీసుకుని బయలుదేరారు.

బస్సుస్టాండువైపు పోతూవున్నారు. దారిలో లక్ష్మణస్వామి సరోజ చెయ్యిపట్టుకున్నాడు.

ఆమె నిరోధించలేదు. అర్థయుక్తంగా అతడు ఆమెచేతిని నొక్కి ఒత్తాడు. ఇది నీపదార్థమే అన్నట్లుగా ఆమె ఊరుకుంది.

ఈలోగా బస్సుస్టాండ్ సమీపానికి వచ్చారు.

తలవంచుకునే సరోజ 'బస్సు ఎక్కుదామా' అంది.

'వద్దు రిక్షామీాదపోదాము' అన్నాడు లక్ష్మణస్వామి.

సరోజ అనంగీకారాన్ని సూచించలేదు. లక్ష్మణస్వామి పిలవగా రిక్షావచ్చింది. స్వామిబుజంమీాద చెయ్యిమోపుతూ సరోజ రిక్షా ఎక్కింది. అంతేకాదు లక్ష్మణస్వామికి తన కుడిచేతిని అందిచ్చి రిక్షా ఎక్కేటప్పుడు సాయంచేసింది.

లక్ష్మణస్వామి, సరోజల మొగాలు విప్పారి మందహాసాంచితాలయాయి. రిక్షా చురుకుగా వెళ్ళిపోతూవుంది—

ఇంతకీ ఇప్పుడు సరోజ సిగ్గు ఏమైంది ?

---

# నన్నెచోడకవి

[౨౬-వ పేజీ తరువాయి.]

నన్నిచోడకవి చెప్పుకొనుట, బిరుదపర్యాయమే కాని, నిజరాజధానీ పురాధిపత్యము కాదని చెప్పక తప్పదు.

ఇంతకును పెదచెరుకూరి శాసనములోని పాకనాటి చోడులకును-నన్నెచోడుని కుమారసంభవంలో ప్రస్తావింపబడిన పాకనాటి చోడులకును భేదములేదు.

Printed at the Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.